# వ్యాసముక్తావళి.

(తొలిసరము)




రచయిత:

భమిడిపాటి సుబ్బారావు, బి. ఏ., బి. ఇడి.,

నరసాపురము.





ప్రకాశకులు.

**వేంకటరామ్ అండ్ కో.,**

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, బుక్ సెల్లర్సు,

ఏలూరు.

***Branch, Market Street,***

SECUNDERABAD (DN.)





PRINTED BY MR. K. KODANDA RAMAIAH,

AT ANDHRA GRANDHALAYA PRESS,

BEZWADA.

**1932.**




[**PRICE As. 10.**

# పీఠిక.

అప్పుడప్పుడు తీరికసమయములు తెనుఁగు వ్యాసరచనావినోదమునఁ బుచ్చెడు అలవాటునకు లోనై కొన్ని వ్యాసములను వ్రాసితిని. ఏ విషయమై గాని సాధారణముగా నిరుగు పొరుగువా రనుకొను భావములనే ప్రోవుచేసి యొక క్రమములో నిడిన హేతువున, నిందలియభిప్రాయములు పాఠకులకుఁ జిరపరిచితములే కావచ్చును. అన్య విషయములమాట యటుండనిచ్చి వ్యాసరచనాధోరణినే యిందుఁ బ్రాధాన్యముగ గణించితిని.

నావ్రాసిన వ్యాసములను వినిన కొందఱు మిత్రు లివి స్త్రీ పురుషుల కెల్లఱకు నందు ముఖ్యముగ బడిపిల్లలకు వ్యాసరచనమున నీతిగ్రహణమున మిక్కిలి సహకారు లగు నని వాకొని వీని నచ్చొత్తింపు మని నన్నుఁ బ్రోత్సహించిరి. తదుపదేశము నా కుత్సాహకారణ మగుడు వ్యాసముక్తావళిని గూర్చి మున్ముందుగఁ దొలిసరమును బ్రకటన గావింప సమకట్టితిని.

వ్యాసమునకు ఎత్తుగడ, రచన, సమాప్తి ముఖ్యములనియు, రచయిత యందాద్యంతముల నధికశ్రద్ధఁ జూపవలయుననియు, దీనిఁ జదువువారు గ్రహించు నెడల నాప్రయత్నము సార్థకము. మఱియు వ్రాసినకొలఁది వ్యాసరచన మలవా టగును. తద్రచనలోఁగల కొన్ని పద్ధతుల నీవ్యాసముక్తావళి రుచిఁజూపును. అనేకాభిప్రాయములు మనస్సులోఁగల్గియు వ్యాసరూపమున వాని వ్రాయఁజాలనిపిన్నల కిది తోడ్పడుచో నామనోభీష్టము నెఱవేఱినదనియే సంతసించెదను.

నరసాపురము,
15-7-32.

ఇట్లు,
భమిడిపాటి సుబ్బారావు.

# విషయసూచిక.



# వ్యాసముక్తావళి.

## భక్తి.

"భక్తిలేని పూజ పత్రిచేటు."

1. భక్తి యనఁ దక్కువవాఁ డధికు నెడలఁ జూపు భయగౌరవసంయుక్తమైన ప్రేమము. అల్పవయస్కుఁ డధికవయస్కుని, నిర్ధనుఁడు లక్ష్మీవంతుని, అల్పవిద్యావంతుఁడు పండితుని భక్తితోఁ జూడఁదగును. ప్రజలు రాజును, బిడ్డలు తల్లిదండ్రులను, ఛాత్రు లుపదేశకుని, సేవకు లధికారిని, ప్రాణికోటి దైవమును స్వదేశమును భక్తిం గనుట సహజము. అనఁగా నే విషయములోనైనఁ దక్కువమైనవా రావిషయమం దుత్తీర్ణులైనవారియందుఁ బ్రేమ, గౌరవము, భయము నను గుణత్రితయసంయుతబుద్ధిఁ బొందుట భక్తి నానుట. అధికుఁడు తన కేదేని యపాయముం గలిగించు ననుకొని జడియుటమాత్రము భక్తి కా దని యిచ్చోట గ్రహింపవలసియున్నది.

2. ఎవఁడు భక్తిఁ జూపఁబడుట కర్హుఁడో వానియందనశ్వరమగు నధికగుణ మేదియో యొక్కటి యుండవలయును.

కేవలము భౌతికవస్త్వాధిక్యముం గని భక్తిఁజూపుట యాయాధిక్యతయున్న యన్నినాళ్లుండి తొలంగిపోవును. అనఁగాఁ గోటీశ్వరుఁడని యొకనిఁ గొల్చువారి భక్తి, యాదరిద్ర్య మున్నంతకాల ముండి తల్లోపముతో నశించును. మార్పుఁ జెందని యనన్యసామాన్యగుణ మేదియో కలిగియున్నవాఁడు భక్తి కర్హుఁడు. పుట్టుకచేతనే యెల్లరు తమ తమ జననీజనకుల యెడ భక్తిఁ జూపవలెను. ప్రజ లేలిక మొదలగువారియందు భక్తియుంచు టొప్పును. భార్యకు భర్తయెడ నుండు బుద్ధి భక్తిపూర్వకము. భర్తకు భార్యయెడ నుండు బుద్ధి నట్లన రాదు? కొలఁది గొప్పలతో నిమిత్తము లేక సమస్తజనులు పరమేశ్వరునియందు భక్తియుక్తు లగుట యుక్తము.

3. భక్తు లిష్టదైవమును సంతతము తలపోయుదురు. వారిచర్యలు చూపఱకు నవ్వు పుట్టించును. హనుమంతుఁడు 'రామ, రామ' యనని క్షణము కానరాదు. ప్రహ్లాదుఁడు విష్ణువును స్మరించుటలో విరామము లేదు. వారేపనులఁ జేసిన నవి భగవదర్పణబుద్ధిప్రేరితములే! వారి కితరము చెవిఁ జొరదు. అందుచేతనే భక్తు లున్మత్తు లను నుడి పొడమినది. కొందఱు భక్తు లారంభస్థితిలోఁ దోడివారియపనిందలకు లక్ష్యము లైరని భక్తచరిత్రములు సాక్ష్య మొసంగుచున్నవి. ప్రజలదండనములు భక్తులకుఁ దగులకుండఁ జేయునది భక్తికవచము. భక్తులు తమ లక్ష్యమైన దైవమును సంతృప్తిఁ జేయుటే ముఖ్య మని శారీరకకష్టములను, ధననష్టమును, సంఘబహిష్కరణములను నోర్చుకొనెదరు. ఓర్చుకొనద

రనుటకంటె యవి తాకని యుద్వేగముతో వారు లక్ష్యము దిక్కుగాఁ బర్విడెద రను టొప్పును. శ్రీకృష్ణుని యెడ గోపిక లును, శ్రీరాముని యెడల గోపన్నయుఁ జూపిన భక్తి యిందుల కుదాహరణముగఁ జేర్కొనందగును. క్రీస్తువెంట నరిగిన మార్గ లనుకన్య భక్తురాండ్రలో మేల్బంతి.

4. దైవభక్తి కితరము లేవియు సాటిరావు. దైవమొసం గించిన మేళ్ళం దలంచుకొని యట్టి దైవమైన దేవునెడల భక్తిఁ గలిగి యుండుట కర్తవ్యము. జీవుఁడు తనదీర్ఘప్రయాణములో నర రూప మెత్తి తక్కిన జంతుజాలములో మిన్నయై, పరమేశ్వరు నిపై భక్తి గల్గియుండకుండుటకంటె గర్హ్య మన్యము లేదు గదా! అయినను నీ వనుదినముగల యఱువది గడియల కాల ములో నేమాత్ర మానమ స్తము నిచ్చిన దాతవిషయికమైన చింతలో వినియోగించుచున్నావో తలంపుము. ఎవ్వని కరుణా లేశమే జగంబున కంతకును బుక్కిలింతలపాలియమై వెల యునో, యెవ్వనిసంకల్పమాత్రమునఁ బ్రపంచమునఁగల భోగభాగ్యములమాట యటుండఁ బ్రపంచములే యస్తమిం చునో, యాచిద్విలాసునిగూర్చి నీ వనుదినము గొంత విచారణ మొనరించి యాతని యెడ భక్తిఁ జూపుట యుచితముగాదా! అట్లొనర్పుము.

5. కొందఱు దైవభక్తులు మఱికొందఱు దైవదత్త ప్రకృతివస్తుభక్తులు. ఇంకను గొందఱు మానవకల్పిత వస్తుభక్తులు. వీరు స్వసుఖమును గణనసేయక తమ యిష్ట దైవముల కలంకారముల నిడ సర్వదా ప్రయత్నించెదరు.

వీరుగాక యిఁకఁ జెప్పంబోవు భక్తులు ధూమపానీయాదితుచ్ఛ భోగభక్తులు, పశవర్తులు. వీరును నిష్టదైవతముల నహర్నిశలు సేవించి యారోగ్యముం జెడఁగొట్టుకొని దుష్ప్రవర్తకుల కాదర్శపాత్రయులై నశించుచున్నారు. వీరు నిజమైన భక్తులఁ దూలనాడి యపనిందల పాలొనరించుచుండుటలో నేమాత్రము వెనుఁదీయరు. వీరును దమ యిష్టదైవములను మనోవాక్కర్మల సేవింతురు. కాని వీరిదైవములు వీరినాశనమునకు దారిఁజూపుట యథార్థము. పైనఁ జెప్పిన ద్వివిధము లగు భక్తులును ద్రికరణశుద్ధిగ నిజదైవములను బ్రేమింతురు. కాని మొదటి తెగవా రుత్తమగతులను, దక్కుంగలవార లధోగతిని బొందెదరు. కాఁబట్టి, యేదైవమును నీ వాశ్రయించుచున్నావో విచారణచేసి తెలిసికొని తొల్తనే నీచాశ్రయమును వర్జించి మే లొడఁగూర్చువాని నాశ్రయించుట నీయుపయోగమునకే యని గ్రహించి, యారీతిని జేయునది. చేతులు కాలినఁ బిదపఁ దన్నివారణోపాయములకై వెదకులాడుట కంటె ముందుగానే యేహానియు రాకుండఁ దప్పించుకొనుట శ్రేయోదాయకము.

6. కష్టములపాలైనవారు, జిజ్ఞాసువులు, ధనకాంక్షులు, జ్ఞానులు నను నాలుగు తెగలవారుమాత్రమే భగవంతుఁ డనిన భక్తిగలవారు. ఉద్యోగభంగమైననాఁడు సుందరకాండము విప్పువాఁడును, రోగగ్రస్తుఁడైననాఁడు ముడుపుల గట్టువాఁడును సుఖదినములలో దేవుని స్మరింపఁడు. జనసామాన్యము లోకవ్యాపారములలో మునిఁగి తేలుచుఁ బర

మేష్ఠియునికినే మఱచును. అతఁడు లేఁడనికూడ పాటు దల
పోసి నాస్తికు లగుదురు. భగవంతుఁడు లేఁడనుకొనువారికి
భగవద్భక్తి పూజ్యమేగదా! సంతోషములో భోగనిమ
గ్నుఁడై యున్నసమయమున నరుఁడు స్వప్రయోజకత్వము
వలన నంతటివాఁడనైతి నని యెంచి, దైన్య మనుభవించు
నాఁ డా దైన్యమునకుం గారణము భగవంతుఁడే యనుకొని
యాతనిఁ దూలనాడుట పామరసామాన్యలక్షణము. భగవ
ద్భక్తివలన సమస్తఫలములును గొంగుబంగార మను వారు
కూడ స్వచ్ఛమైన భక్తి నీశ్వరునిపైఁ బాదుకొల్పరు. ఇది
హాస్యకరవిషయము; నిరుత్సాహపఱుపవలసిన సమాచా
రము.

7. భక్తిఁ జూపుటకు సఖ్యము, శ్రవణము, దాస
త్వము, వందనము, అర్చనము, సేవ, ఆత్మలో నెఱుక, సంకీ
ర్తనము, చింతనము నను తొమ్మిది మార్గము లున్నవి. వివిధ
మతములవారు వివిధమార్గముల భక్తిఁ జూపుచు నొండొరుల
నపహసించుకొనుట నిజభక్తిలోపసూచకముగాన నది కూ
డదు. ఇన్నిమార్గముల నొక్కభక్తుఁడే యనుసరింపఁ దగును.
లేదా కొన్నిఁటిఁ గొన్నియెడల నుపయోగింపనగును. గొప్ప
వానియెడ భక్తిఁ జూపుట స్నేహముమూలమున, నూడిగము
మూలమున, వందనముమూలమునఁ గావచ్చును. లేదా మఱి
యేయితరపద్ధతులనైనఁ గూడ నవలంబింపవచ్చును. దేవుని
విషయమై వీనికిందోడు సంకీర్తనము పూజ ధ్యానము చేకొను
వా రున్నారు. దేశభక్తుల సంకీర్తనములు చిరపరిచితములే.

మార్గ మేదైననేమి త్రికరణశుద్ధమైన భక్తి యుండవలయును. లేనిచో నది కపటవిశేషణ పూర్వపదభక్తియగును. కపట భక్తి సోపాధికము, ప్రేమశూన్యము, గౌరవహీనము. అట్టి కపటభక్తులు మోసగాండ్రు, స్వలాభపరాయణులు, దుస్తంత్రిజ్ఞులు. వారు నిజకార్యనిర్వహణకాలముననే, నక్కవినయములఁ జూపి,యాపిదపధ్వజమెత్తెదరు. అట్టివారిని నిరుత్సాహపఱచుటకు, నట్టిభక్తిని నిరసించుటకు నిజమైనభక్తి లజ్జ లేక మనోవాక్కర్మలఁ జూపఁబడునదై యుండవలసియున్న దని పురాతనమైన తీర్మాన మున్నది.

8. కొంతమంది దైవమునకైనను సరే సేవ సేయుట భక్తి జూపుట నిజప్రతిభకు భంగకర మని యూహించెదరు. దేవాలయమునకు బోవను, నమస్కారముచేయను నాత్మగౌరవహీన మనుకొనువారు నిట్టిజనులే. వారు కేవలము పరులఁ బరిపాలించుటకే మేము ప్రత్యేకము పుట్టితి మనుకొను సర్వజ్ఞత్వపూరితహృదయులు; అధికారమదోన్మత్తులు; ఐహిక భోగాసక్తులు. వారైననుఁ దమ కపకారము జరుగనున్నవేళ నది తప్పించుకొనుటకు లోకుల మెప్పుదల వడయుటకు దొంగ భక్తిని బ్రకటించెదరు. ప్రమాదము దాఁటినమీఁదట యథాపూర్వస్థితిలోనికి మాఱి తాటిమువ్వెక్కి కూర్చుండెదరు. ఒకప్పుడు భక్తిమూలమునఁ బ్రమాదములు తప్పినవనుకొను వారుగూడ నటుపైన నిజమైన భక్తు లేల కారోగదా!

9. అంతరంగమున భక్తి కలదు. తత్ప్రకటనకార్యములతో మాకు నిమితము లేదని కొందఱివితండవాదము. కాని,

భక్తి యణఁగి నిల్చి ప్రకటన మొల్లనిది కాదు. ఒకని బాహ్య వర్తన మాంతరంగికభక్తి కనుగుణముగ నుండితీరును. అందు చేత బాహ్యవర్తనమునఁ గన్పట్టనిభక్తి చాటున నుండదు. ఒకనిప్రవర్తనమున భక్తిలక్షణములు లేనిచో వానిహృదయ కుహరమునఁగూడ నది శూన్యమే యనఁజెల్లును.

10. కాఁబట్టి యభ్యాసముచేసి భక్తిబీజమును నీమనః ఫలకమున నాటుము. ఈశ్వరభక్తిని బెంపొందించుకొనుము. పెద్దలను గురువులను జననీజనకులను భక్తితోఁ బూజింపుము. ఎంతయధికభక్తిగలవాఁడవైన నంతసచ్ఛీలవంతుఁడవై పేర్గాంచెదవు. భక్తి కసాధ్య మగు కృత్యము లేదు. అందుచేతనే భక్తులహృదయము లీశ్వరధామము లని ప్రసిద్ధి.

---

# పరహితాచరణము.

క॥ పరహితము సేయఁ బూనిన
పురుషుఁడు పాపంబు సేయఁ బొందఁడు కీడున్. భా॥ శాం॥

1. నిరంతరము స్వకుక్షింభరకార్యపరులై యుండక పరులకు హితమగు పను లొనరించుట మానవుల కనీసధర్మము. ఇది యార్యవచనము. ఎవరు పరులు? వారి కేది హితము? పరహితము తెలిసికొనుటెట్లు? తెలిసికొనియుఁ బరహితకార్యము లెల్లఁ జేయుట సుసాధ్య మగునా? ఇట్లు సందియంబులసంఖ్యమితిమీఱియుండ నరుండా పరహితాచరణధర్మము నెఱవేర్చుచుఁ గృతకృత్యుం డగుటకు మార్గ మేది?

2. ఎవ్వనికైనను దానుదక్కఁ దక్కిన బంధువర్గము, మిత్రబృందము, తదితరమనుష్యలోకము, జగత్తులోని సమస్తజీవరాసులు ననఁగా బ్రస్తుతము సజీవులై యున్నవారలే గాక ముం దుద్భవించెడి ప్రాణిసమూహముకూడఁ బరు లని యర్థము. ఇట్టిస్థూలబుద్ధితోఁ గాక సూక్ష్మబుద్ధితోఁ జూచిన నెల్లరయందున్న జీవుఁడు పరమాత్మాంశమే యగుటచేఁ బరులనఁదగినవారే కానరారు. ఇదియెఱింగి తండ్రి కుమారునకు మనుమనికే కాక నిజసంతతిలో నుదితులగు నితరులకుఁగూడ నమితసౌఖ్య మొడఁగూర్చుధనము సేకరించుకై వడి, మనుజుఁడు సమకాలికులకే కాక భావిజనులకుఁగూడ హితముగుకార్యము లొనర్చునది. వారి కేది హితమని సందేహంబులఁ గుంద నక్కఱ లేదు. తన కేదిహితమో వారికి నదియే హితము. తన కిష్టమైనదై హానికరముకాని కార్యము సులభముగా శ్రమలేక చేసికొని యెట్లు నరుఁడు సుఖించునో యాదేరీతిని మంచిపనులఁజేసి యాత డితరులకుంగూడ సుఖ మొడఁగూర్పవలయు. అంతియ కాక,యితరులుకొంద ఱొనరించినపనులవలనఁ దాను ఫలమనుభవించుచుండి, యా యుపకారులకందఱకుఁ దా నే చందమునఁ గృతజ్ఞత దెల్పుచుండెనో యాచందముననే ముందుతరములవారల మేలుకొఱకు వాఁడు కొన్ని కార్యముల జేసిన వారి కృతజ్ఞత వడయుం దగు. తా ననుభవించునవన్నియుఁ గల్పించినవారెల్లరు సజీవులై నేఁ డుండిరా? వారిలోఁ బెక్కండ్రు పరమపదించి స్వర్గ మలంకరించిరే. తన్మృతులకుఁ దనకృతజ్ఞతఁ దెల్పుటకు మార్గము పుట్టఁబోవువారి కనుకూలకార్యములఁ

దా నాచరించుటే. నిజదేశకాలపాత్రములఁ బట్టి తన కేది హితమో నిజాంతరాత్మ నడిగి యెఱిఁగి యది యేరీతి నున్నచో రాఁగలకాలమందుఁ దన కుపయోగపడునో గ్రహించి యట్టి పనులే పరులకును హిత మని నిశ్చయించి నరుఁడు వానినొనరింపఁ బూనవలయును. ఒకవేళ ముందు ముందు పరిస్థితులు మాఱిపోయినప్పటికి, నతఁడు నాటినపునాదులపై నూతన భవననిర్మాణము భావిసంతతులకు సుకరము. మఱియు సూర్యోదయాది సూర్యోదయము వఱకు జీవితకాలములో నెన్నియుండిన నొక్కనికి సుఖమబ్బుచున్నది. అట్టిచో లోకమంతయు వర్తమానభవిష్యత్కాలములందుఁ బ్రమోదము జెందవలెనన్నచోఁ గావలసిన వెన్నియో యుండును. అవి యిట్టివి, యిన్ని యీ మాదిరి వని వర్ణించి లెక్కించి నిర్ణయింప నేరితరముఁ గానిపట్ల వాని నన్నింటి నాచరించు టెట్లందు వేమో? ఇది గొప్పసంశయమే కాని పనిచేయువానిహృదయమునకుం దట్టునట్టిదిమాత్రము కాదు. పరహితము చేయనేరని సోమరి పనిఁ దప్పించుకొనను నెంచి పనిపట్ల శ్రద్ధవహింప నొల్లనిసమయంబులయందుఁ బైకి వాదనాపూర్వకంబుగ వెల్లడిచేసెడి సందియం బిది యని నమ్ముము. పనిచేయఁగలవాఁడు పరహితాచరణధర్మము నిర్వర్తింపఁదలంచినవాఁడు నేదియో శక్త్యనుసార ముడుతభక్తితోఁ జేయుచునే యుండును. కాని వితండవాదనలకు దిగఁడు. సోమరికి మొదలే దొరకదుగాని పాటుపడి చేయువానికిఁ జేసిన కొలఁదియుఁ జేయవలసినపనులే కానుపించును.

3. పనిపై బుద్ధిగలనరుఁడు స్వోదరపూరణంబునకుఁ గాక యింటిలోనివారికందఱకు నాహారసామగ్రిలు, వసనములు, తదితరసంభారములు గడించుచున్నాఁడు. కుమారుఁడు తనవలె శ్రమపడనక్కఱలేకుండ గొప్పయాస్తితో జీవనము ప్రారంభింపవలెనని యూహించి తద్వసతి సంపాదన మారంభించుచున్నాఁడు. వార్ధక్యావస్థలోఁ దా విచ్చలవిడిగ వ్యయమొనర్చుకొనుటకు ధనము నిలువఁజేసికొనుచున్నాఁడు. తానకస్మాత్తుగఁ బేదటికంబులో మరణించిన యెడల నాలుబిడ్డలు నిరాహారులై యుండనక్కఱలేకుండ, దాఁ బొట్టగట్టుకొనియైన ధనము దాఁచుచున్నాఁడు. ఇదంతయుఁ బరహితమేకాని వీనిలో నేను, నాసుఖము, నావారు, నావారిసుఖము, ననునట్టి యహంభావమున్నది. అందుచేఁ గేవలము నిజసౌఖ్యాభిలాషి కానివాఁడయ్యు నరుఁడు పైసందర్భములోఁ బరహితమొనరించినాఁడను ప్రశంసకు ముల్లువాసి క్రిందగునుగాని మీఁదుగాఁడు. దీనివలెనే తన కెప్పుడైన నితరులతోఁ బనివచ్చునేమో యని వారి కిప్పు డుపకార మొనరించుటఁ బరహితంబుగాక యాత్మహితంబునాఁ బఱగు. ఇచ్చట నరుఁడు పరహితం బొనరించినాఁడని తలంప నేయవకాశము లేదు.

4. పలుపలుకు లేల? పరహితగుణభేదంబు లొక్క తేటగీతమున నుత్తరహరివంశమునఁ బేర్కొనఁబడినవి. అది యెట్లంటేని వినుము: 'ఉత్తముండు హితము చేసి యూరకుండు। మధ్యముండు హితముచేసి మాఱువెదకు। నధముఁ డొరుచేయు హితమైన నడిచిపుచ్చు। హితమునకు నెగ్గుచేయువాఁ డెవ్వఁ

డగును?' ఉత్తములు పత్రికటనకై కాక ధర్మబుద్ధితో బరహిత కార్యములు చేయుచుందురు. దారిని బోవుచో గంటుఁబడినకంటకము నెత్తి దూరముగఁ బారవేయుట, నడువలేని దుర్బలులకుఁ జేయూతనొసంగుట, గ్రుడ్డివారికి దారిచూపుట, వ్యాధిబాధితులచెంత కరిగి యుపశమనవాక్యము లాడుటయుఁ బరహితాచరణకార్యములే. "ఎన్నఁడో కాని యిది కాపునకు రాదు. నేను దీనిఫలముల ననుభవించెదనా" యనెడి సంశయంబులం బడక మొక్కలు నాటుటయు నట్టిదే. ప్రఖ్యాతికొఱకు వేలాదిరుప్యవాగ్దానములుగాక గుప్తముగ నొక్కదమ్మిడియో, గుప్పెడుతండులంబులో నిరుపేదవాని కిడుట తత్తుల్యమే. సద్యఃఫలితమున కాశించి, పొట్లపాదుఁబెట్టి దానికాయలు తిని, సంవత్సరము తిరుగకుండ దానిమొదలంట నాశనమొనరించుటకంటెఁ బలు పక్షి జంతు మానవ సముదాయములకుఁ గలకాలము ఫలపత్రిచ్ఛాయాశ్రియంబు లిచ్చు వటవృక్షపుబీజంబులు నాటి పెంచుటయు, నెందుకైన మంచి దని యెంచి పెద్దమండలాధికారియింటిదుఃఖమును దగ్గింపఁగపటపు ప్రేమవాక్యము లాడుటకంటె, దిక్కులేనివారికవ్యాజోపశమన వాక్సాహాయ్యమో, ధనసాహాయ్యమో, శరీరసాహాయ్యమో చేయుటమొదలగునవన్నియుఁ బరిశుద్ధములైన పరహితకార్యములుగాని యన్యంబులు కావు. 'పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్'అను కాళిదాసోక్తి యవశ్యస్మరణీయము.

5. బాటసారి యెండవేళ చెట్టునీడలో విశ్రమించి, యాతపబాధయు గమనశ్రమయు స్వేదజలధారలను బాపు

కాని చెట్టునాఁటినఁ దాఁ బేరెఱుంగని పుణ్యమూర్తిం గొండాడుట వినియుఁ గనియు నరుఁడు పరహితం బాచరింపఁ గడంగకుండుట యన్యాయము, అక్రమము, అధర్మము. కావున నిదివఱకే నీవు పరహితకార్యసాధన మారంభించితివా నిర్విఘ్నముగఁ గొనసాగింపుము. లేదా యాలస్యమై మించిపోయిన దేమియు లేదు; ఈనాఁడే తదాచరణమునకుం గడంగుము. ఒక్కపని చేసి దానిస్తుతు లెంతుఁ బ్రకటింపఁబడిన వని పత్రికలఁ దిరగవేయుటతోఁ గాలముం బుచ్చక, దానినే వర్ణింపఁ సమకట్టక, యది చేయనట్టుగనే భావించి, మఱిమఱి యనేకపరహిత కార్యములొనరించి చుట్టుపట్లవారి సుఖమునకును బ్రస్తుతాగోచరభావిలోకముయొక్క సౌఖ్యమునకును గారణమువై వారిప్రస్తుతులకు నిదానమవై యెప్పటికిని మృతజీవుఁడవై వెల్గొంద నుద్దేశింపుము.

6. జీవనదీమతల్లులు సర్వదా నిర్మలజలంబుల క్షేత్రారామంబులకును నరసమూహమునకును జంతునివహంబులకును బక్షిసంతానంబులకు నొసంగుట స్వలాభముకొఱకా? వృక్షరాజంబులు ఫలంబులను సూనంబులను గాచి పూని, జగంబుం దనియించుట స్వలాభార్థమా? గోవు మొదలగు జంతువులు నరుల కుపయుక్తంబులగు దుగ్ధంబు లొసంగుటయందు స్వలాభాపేక్ష యున్నదా? బాటదరినున్న వృక్షము లెండఁ బాంథులకు ఛాయ నొసఁగి, విహంగకులాయనిర్మాణంబునకుం దా విచ్చి పరోపకారము చేయుచుండుట గాంచము? భానుండు జగన్నేత్రమై, వేవెలుంగుల నిచ్చి, పైరులఁ బెంచి,

దోరగాయలఁ బండించి, చీఁకటిఁ బారఁదోలి, చలి నడంచి యెన్ని
యోవిధముల మహోపకారంబు లొనరించుచుండుట పర
హితకార్యాచరణమనియే గదా! అది తనధర్మ మను నమ్మక
ముం గలిగియుండుటచేతనే గదా, యాతఁ డట్లొనర్పఁ గల్గుచు
న్నాఁడు? నీ చుట్టునున్న నే ప్రకృతివస్తువునుగాని యేయల్ప
ప్రాణిని గనినగాని తన చేతలచేత 'ఓనరుఁడా, నీవు జ్ఞాన
వంతుఁడ వని విఱ్ఱవీగెదవుగాని నావలె పరహితాచరణం బొ
నర్పఁగలవా!' యని ప్రశ్నించుచున్నమాడ్కిఁ గన్పట్టును.

7. కాఁబట్టి నిష్ఫలాపేక్షతో ధర్మబుద్ధితో యావ
చ్ఛక్తితోఁ బరహితంబుం గూర్చుట యైహికాముష్మికసుఖ
ప్రదంబు.

'సజ్జనులు దారె పరహితాచరణమతులు.

---

# వాగ్దానము.

'* * * *

పలికి బొంకక నిజమునఁ ♦ బరఁగు కంటె
మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె?' —భాగవతము.

1. ఏపనినైనఁ జేసెదననిగాని, చేయుననిగాని యొకొ
కనికి మాట యిచ్చుటే వాగ్దానము. తక్కిన దానములకును
వాగ్దానమునకును భేదము హస్తిమశకాంతర మున్నది. గోదాన
మనఁగా గోవు నొకని కిచ్చుట. దాన దాతకుని ముగియును

ప్రతిగ్రహీత సంతృప్తుఁడై యానందించును. వాగ్దాన మిట్టిది కాదు, ముం దెప్పుడో యొకపని చేసెద నని మాటయిచ్చుట మాత్రము ప్రస్తుతము జరుగును. చేయవలసినపని యట్లే యుండును. దానిచేత కొంకను వ్యవధియుండును. అనఁగా మాట యిచ్చుటకును బనినాచరించుటకును మధ్యఁగల యవకాశము కొంచెమైన నది దుష్టమైనది. ఏమనఁగా నాసందునవిఘ్నేశ్వరుని పెండ్లికి వేయివిఘ్నము లన్నట్లెన్నియో యంతరాయములు గలుగవచ్చును. వాగ్దాన మొనర్చినవానిచిత్తవృత్తిమారవచ్చును. స్థితిగతులు భేదింపవచ్చును. అన్నమాట నిలుపుకొనలేక పోవుటయే కలుగవచ్చును. వడ్డించుకొన్నది తినుముం దెన్ని యాటంకములోఁ గల్గును. మాట క్రియారూపముఁ బొందుట యన్న నెంతకష్టము; ఆలోపున కర్తయే నశించిపోవచ్చును. అందుచే వాగ్దానము తక్కినదానములందు దేనితోడను బోలికఁ జెందదు. వాగ్దాన మధికదానమగుటచేతనే తక్కిన దానముల కతీతమైనదై నిదానముతోఁ జేయవలసినదై యున్నది.

2. పలుచిక్కులీ వాగ్దానమం దుండుటచేతనే యెవ్వఁడును దొందరపడి వాగ్దానము లేవియుఁ జేయరాదు. 'స్వల్ప కార్యమిది, నేఁ జేయఁజాలనా' యని గర్వించి వాగ్దాన మొనర్పఁ గూడదు. ఈపని నా కలవియగునా కాదా యనియు, వీనివిషయములో నే నిట్లు చేయవచ్చునా చేయరాదా యనియు, మఱెన్నియో యోజించి మాట నోరు జారవేయవలయును. కాలుజారిన సర్దుబాటుఁ జేసికొనవచ్చును గాని మాట నోరు

జారినచో సవరణ దుర్లభము. ఏ మనుచున్నావో నిదానదృష్టితో నాలోచించి సందర్భములు గమనించి నీసాయ మర్థించువాని పుట్టుపూర్వోత్తరము లారసి, యనినమాటఁ జెల్లించుకొనఁగల సను ధైర్య మున్నప్పుడే నాలుకఁ గదలింపుము. ముందువెనుక లారయక యనాలోచితముగఁ గ్రియాహీనములగు వాగ్దానములు చేయుట నాల్కకు వ్యర్థ పరిశ్రమ; చేటు.

3. ఒకసారి వాగ్దాన మొనర్చిన పిదప నది భంగమువడకుండ నిలుపుకొనుట పరమోత్తమపద్ధతి. అట్లు బలి, శిబి మున్నగు మహాత్ములందఱు మాట నిలుకడగలవారలు. ఆడిన మాట వారివలె నిలుపుకొనుటయే నరునకు గౌరవప్రదము. తద్గౌరవార్జనకొఱకు ధనము సంతానము రాజ్యము ప్రాణముఁ గోల్పోయిన వారిపవిత్రచరిత్రములతో గ్రంథములు నిండి నిబిడీకృతమైయున్నవి. సిరియాలరాజదంపతులు కుమారుని ఱోటఁ దంపి వండి యతిథుల బూజించినది, హరిశ్చంద్ర చక్రవర్తి మకుటము నాలుబిడ్డలను గోల్పోయి కాటికాపరి యైనది యెందునిమిత్తము? అనినమాట నిల్పుకొనుటకుఁగాదే? అందుచేతనే గదా గ్రంథములలో వారినామము లాకాశమున నక్షత్రములట్లు ప్రకాశించుచున్నవి. సముద్రయాన మొనరించు నావికుల కట్లు, లోకయాత్రఁ జేయు సాధారణమానవుల కానక్షత్రములే గదా సరియగుమార్గము నెఱుంగ సాయపడునట్టివై వెలుగొందుచున్నవి.

4. మాట నిలుపుకొనలేకపోవుట యగౌరవకరము, దుర్బలత్వ సూచకము, కిల్బిషకారణము. మాటనిలుకడ లేని

వాని నితరులు నమ్మక దూరము సేయుదురు. కావలసినవారు మిత్రులునుగూడ వానితో నేవ్యాపారమును బెట్టుకొనుటకు భయముఁ జెందెదరు. 'ఎల్లవారు నాడితప్పినవానిని దూషించెదరు' 'ఆడితప్పినగా...' కను దూషణమును వినిన గార్దభ మొకటి 'అయ్యో! నాగర్భమున నిట్టి ఖలుఁడా జన్మించినాఁ' డని విచారించిన దని చెప్పుహాస్యకథసారాంశ మేమి? చేసినవాగ్దానము కార్యరూపమునఁ బరిణమింపఁజేయ నేరనివాఁడు గాడిదకంటెను నీచుఁ డని యేకదా!

5. కాఁబట్టి సమర్థత లేనివేళ యొకవాగ్దానము బడాయికో, ప్రమాదముననో, వేళాకోళమునకో చేసి, యామాటప్రకార మాచరింపక యూరకుండుటకంటె మొదలు వాగ్దానము చేయకపోవుటే సమంజసము. అంత్యనిష్ఠురముకంటె నాదినిష్ఠురము మేలు. ఒకనికి సాయముచేసెద నని చెప్పి చేయకున్నచోఁ గల్గునష్టము లెంచుము. సాయము పొందగోరు వానికిఁ బూర్వభయ మట్లె నిల్చుట, దానికిఁ దోడాశాభంగము కలుగుట, సాయమొనరించెద నని యొనర్పనివానికి శాశ్వతగౌరవకళంక ముప్పతిల్లుట యను నష్టత్రయం బుదయించును. తొల్తనే సాయము నాశపెట్టకున్నచోఁ దదపేక్షకుఁడు వేఱొక్కనికడ కేగ, కోర్కు లంద నవకాశముండు; నదియుఁ దొలంగుట యను మఱొక్కటిఁగూడఁ జేర్పదగును. ఆడితప్పుటకంటె మాటాడకుండుటే మేలు.

6. పేరో ప్రతిష్ఠయో పత్రికలోఁబడు నని కాని యభినందన సభలలో నుతులఁబడయుందగునని కాని వేలకొలఁది

విరాళముల వాగ్దానముచేసి కొందఱుపొందిన ప్రతిష్ఠ స్వల్పమే కాని, ఆవిరాళపుధనము నీయక వా రందిన యప్రతిష్ఠ దిక్కులు ప్రతిధ్వనించి పోవుచున్నవి. అట్టివా రెందఱో నీ చుట్టుపట్ల నున్నారు. మొక్కవోయిన వారిగౌరవస్థితి నారసినైన నీవు వట్టి వాగ్దానముల నెన్నఁడుం జేయకుము. ఎంత స్వల్పకార్యమైనను నీవు చేయుదు నని చెప్పి చేయకుండుట వాగ్దానభంగమే! ఆటపాటలలోఁ బరిహాసమునకుఁగాని, వ్యాపారములలో ముందు వెనుక లారయకగాని, సంతోషసమయంబుల సుహూళముచేఁగాని, వేయేల, యేస్థితిలోఁగాని వాగ్దానములఁ జేయువలదు. ఒకవేళ నేకారణముననో మాట నిచ్చితివా, మూఁడాఱైన నాఱుమూఁడైనను సరే మాటనిలుపుకొనుటే ప్రధానముగ గణించి తన్నిర్వహణమున దేహమనోబుద్ధిబలముల వినియోగించి, ధనమును, బంధుగులను, మిత్రులను, ప్రాణములను గోల్పోయి నైనను దాని నిల్పుము. స్వలాభము నెంచని వాగ్దాననిర్వహణము ప్రశంసాయోగ్యమై శాశ్వతకీర్తిదాయకమై వెలయును.

---

## క్రమము.

1. ఇల్లు చూచి యిల్లాలిగుణము కనిపెట్ట నగును. ఇది సామాన్యలోకోక్తియేయైనను దీనియం దిమిడియున్న భావము మహోత్కృష్టమైనది. ఇంటిలో నెక్కడనున్న వస్తువుల నక్కడనే విడువక, యవి యుండవలసిన తావుల నుంచు గృహిణి

ప్రీతికార్యమును సొంతముగను, మనోరంజకముగను, యథా విధిగను నిర్వర్తింపఁగల దనియే యీసామెత కర్థము. అగరు పుల్లల నంట గిన్నెలను, బుస్తకములఁ గూరగాయలను గలిపి గుచ్చెత్తు నామె సదనము లొగ్గిడిగా నుండి శుచిత్వదూర మగును. సూది కొకస్థలనిర్ణయము లేమింజేసి సూచికాన్వే షణమునకుఁ జీపురుకట్టమొదలు చీనిచీనాంబరములవఱకుఁ బదార్థాలోకనదీక్షఁ బూని తిరుగవేసి బోర్లింపవలసి వచ్చును. అప్పుడైనను వెదకెడిది లభించు నని నిశ్చయము లేదు. ఎడ్డతనముచేత వస్తుసముదాయము నంతయుఁ గలగాపులగ మొనర్చినచో గృహము క్రమము తప్పి గత్తరగ నుండును. ఏదైన వెదకుటచే వ్యర్థకాలహరణ మగును.

2. ఏపనికైనను గ్రమ మావశ్యకము. ప్రపంచము లో బ్రహ్మాదిస్తంబపర్యంత మెన్ని చూచినఁ జిందఱవంద ఱగ నున్నట్లుఁ గన్పట్టినను భగవంతుని క్రమానురక్తియే సూక్ష్మదృష్టికి వెల్లడి యగుచుండును. జంతువుల యుత్పత్తి స్థితి లయములలోఁ గ్రమము. రసాయనవస్తుసమ్మేళనమునఁ గ్రమము. ప్రతిపదార్థమునందు నణువులసంపుటిలోఁ గ్రమము. ఖగోళచలనమునఁ గ్రమము. మనుజుం డెటుఁగన్నఁ గ్రమాను సరణములైనవే దృష్టిగోచర మగుచున్నవి. ఇంచుక క్రమ మెచ్చటఁ దప్పినను సృష్టిలోని గోళములు డీడిక్కీలు గొట్టు కొనును. బెజవాడ ధూమశకట విశ్రాంతి స్థానమున కరిగి నిలిచిన నెంత యల్లకల్లోలముగ నుండును? వచ్చువారు, పోవువారు, నిలువ నుంకించు శకటములు, కదలఁ గడంగు

బండ్లుఁ గన, దారి తెన్నుఁ దోఁచక యయోమయముగా నుం డును. ఘంటారావములు, నీలలధ్వనులు విని యెప్పటిబండి యప్పుడే యొకదానివెంట నొకటి కదలి వివిధవేగములతో వివిధమార్గగాములై పోయి కొంతసేపటి కావిశ్రాంతిస్థానమున విశ్రాంతి విశ్రాంతిఁ దీసికొనుచున్నదా యన్నట్లుండును. మొత్తముమీఁద నాస్థలము గగ్గోలుగాఁ గ్రమహీనమైనట్లు స్థూలదృష్టికిం గన్పట్టినను నెంత స్వల్పకార్యమైనను గ్రమా నుసరణముగ నడచుచున్నది. క్రమమే లేనిచో నచ్చట విశ్రాంతియే పొసఁగదు సరికదా బండ్లొకదాని కొకటి కొట్టు కొని బ్రద్దలై జననాశము దినదినము సంభవించుచుండవలసి నదేకదా!

3. క్రమమువలనఁ బ్రమాదములు తప్పుటయేగాక కాలము వ్యర్థము కాదు. కాలము విలువ గమనించువారల కీ క్రమ మత్యావశ్యకము. గృహకృత్యవ్యాపారముల నహ రహ మొక్కతీరునఁ జేయు నటివకది యలవాటై యేపొద్దున నాక్రమము తప్పునో యాపొద్దే చిత్తభ్రమ ముదయించిన ట్లుండును. ఉదయంబున నిద్రమంచముమీఁదనుండి లేచి యేపని ప్రారంభింపవలయునో నిశ్చయము లేక దేనిలోఁ జేఁ జేసికొనవలెనో యెఱుంగక యొకటి ప్రారంభించి సగముచేసి దాని నచ్చటనే విసర్జించి మఱొక్కటి చేయఁదొడంగి యదియు నట్లే యర్థకృషిగ ముగించి కూలంకషాచరణ మొందును లేక కాలహరణ మొనరించువార లెందఱో యున్నారు. అంగడికిఁ బోయి క్షణములో వచ్చెద నన్నవాఁడు దారిమధ్యమునఁ

గంటఁబడినవానితోఁ బొల్లుమాటలాడి, యవేళయగువఱకుఁ గడపి, రిక్తహస్తములతో నింటికరుదెంచునెడల వానికిఁ గాలము విలువగలదని తెలియునే? ముందుగఁ గార్యక్రమము నిర్ణయము జేసికొనకపోవుటచే నెందఱో యెన్నిపనులో చేయ సమర్థులయ్యు నొక్కటియుం జేయఁ జాలరైరి.

4. ఇంటి యజమాని క్రమము దప్పినచో గృహవాసులకందఱకు నక్రమానురక్తియే యలవడును. వేళకుఁ దిండికిరాని భర్త తనకుఁ దోఁచినప్పుడు వంటఁజేయు భార్యను, దరుణము దాఁటిన పిదపఁ గార్యము లాచరించు సేవకులను, నుండుండి యొక్కఁడు నుడుగుండి యొక్కఁడు భోజనమునకు సిద్ధమగు సంతానమును బొందియుండును. భార్యగాని సేవకులుగాని సంతానముగాని నైజముగ నక్రమాభిలాషులు కారు. గృహయజమాని క్రమవిముఖత్వమే వారి నట్లు చేసినది. ఇల్లంతయు నల్లకల్లోలముగఁ గాక క్రమముగ నడుపవలయు నన్నచో యజమాని క్రమము నవలంబించి సర్వకార్యములు నుచితవేళలఁ జేసెడివాఁడై యుండఁదగును. అక్రమాభిలాష యంటురోగమువలె నింటిలోనివారి కంటకుండఁ జేయఁగల వైద్యోపాయములు ప్రతిగృహయజమానియుఁ దెలిసికొన వలయును.

5. క్రమము గృహమును శుచిర్భూత మొనరించి యెంతయో మనోరంజకముగఁ జేయును. ఒక చిన్నగదిలోఁ గుటుంబమంతయుఁ గాపురము చేయుచున్నను నొక్కొక్క స్త్రీరత్నము సర్వవస్తుసముదాయములను జిత్రవిచిత్రముగ

సర్ది ప్రతివస్తువున కొక తావును గల్పించి దేని స్థలమున నావస్తువు నుంచి నిజమైన పుణ్యముం బ్రకటించును. తత్సదనసందర్శన మానందదాయకము. అంగడిలోనున్న రకరకముల తినుబండారపువస్తుక్రమము కన్నులపండువై చూపఱకు నోరూరఁ జేయును. కన్నులు మూసికొని చేయిసాచి చూడక యిచ్చట నీవస్తువున్న దని చెప్పి తీయవచ్చును. పుస్తకభాండాగారములోని గ్రంథసంచయములకుం గల క్రమ మత్యద్భుతమైనది. పుస్తకముల వెదకువానికా కబ్బములక్రమము పనిని తేలికజేయును. అన్వేషణమును సౌకర్యమొనరించును. భాండాగారమును శుచిత్వముగ నుంచును. పదిపుస్తకము లున్న వాఁడు వానిని వరుసక్రమముగఁ బెట్టుకొనక గదినంతయుఁ జూడ శక్యముకాని స్థితిలో నుంచుకొనునుగాని, భాండాగారము పుస్తకక్రమమునం జేసి శుచివంతముగ నుండును.

6. చిన్నయింటిలోఁ గాపురముండుటవలన గ్రమహైన్యమును సౌధంబులో నుండుటవలనఁ గ్రమాతిశయంబును గల్గవు. కుటీరమైనను సౌధరాజమైనను దన్నివాసజనుల నైజగుణమును బట్టి క్రమముగనో క్రమముతప్పియో యుండును. నిఱుపేదరాలై పర్ణశాలలోనున్న స్త్రీయైన నొకతె గృహమును లక్ష్మి తాండవ మాడుచున్నట్లుంచును. దివ్యభవనములందున్నను నొక్కొక్కస్త్రీ క్రమముగా వస్తువులఁ బెట్టక క్రమముగా నేకార్యములఁ జేయక గుమ్మములోని కరుగువాని కాపెయిల్లు పెద్దమ్మ కావాసమైనట్లుగాఁ దోఁచుభంగిని జరియించును. కొందఱుధనికుల మందిరములలోనికిం దొంగిచూచి

తివా కుర్చీలపై నీఁగలుముసురు బ్రాఁచిపానీయపాత్రలును, బల్లలపై నెండుతమలపాకులుగల పళ్లెరములును జెల్లాచెదరుగ నీకుఁ గానవచ్చును. క్రమముగ సదనము నుంచవలెననెడి యభిలాషయే యట్టియిండ్లయజమానులకుఁగాని యజమానురాండ్రకుఁ గాని తక్కుంగలజనములకుఁగాని లేదనియే నీ వూహింపవలయును. మఱియు విశేషవస్తుసముదాయముగలవారికిఁ గ్రమముగా వాని నుంచుకొనుట కవకాశము లేదని కొందఱవ్యర్థవాదము. దానినిబట్టి తేలెడి దేమనఁ గ్రమమునకుఁ బదార్థాతిశయమునకుఁ జుక్కయెదురనియు నవి యొక్కచో నిల్వ వీలు లేదనియు; ఇది యసత్యము.

7. స్థలకుశలత్వబాహుళ్యములుగాని, ధనహీనతావిశేషతలుగాని, యల్పాధికజనసంఖ్యలుగాని, క్రమముయొక్క యంతరాయాభివృద్ధులకు మూలములు గాఁజాలవు. నైజముగనో యలవాటుచొప్పుననో క్రమాసక్తి యుద్భవించినమానవుఁ డింటికొక్కఁడున్నను వాఁడు గృహక్రమకారకుఁ డగును. సహజముగ నాగుణము లేనివారు పరిశ్రమ చేసి క్రమబుద్ధి నార్జింపఁదగును. వేకువను లేచి, దినమంతయుఁ జేయవలసిన పనుల నిర్ణయించుకొని యొకపట్టిక వ్రాసికొనియో జ్ఞాపకముంచుకొనియో యందు విరామవాహ్యాళుల కనుకూల కాలముల నిర్ణయించుకొని యాప్రకారము నడువఁ బ్రయత్నించి రాత్రిపరుండఁబోవువేళ నాపట్టికయం దుదాహరించిన వెన్ని యాచరణమం దిడితివో తెలిసికొనుము. మొదటినాఁడు పట్టికలో నొక్కటియు నీవు చేయకపోవచ్చును. అంతమాత్రమున

భయపడక ధైర్యముతో నావిధముననే చిరకాలమొనర్చి తివా జీవితకార్యపద్ధతి సాధ్యమగును. పట్టికలో నప్పుడప్పు డవసరమునుబట్టి స్వల్పములగు మార్పు లుండవచ్చును. ఏమన నది బ్రహ్మలిఖితముగాని రాజశాసనముగాని కాక యనుభవ శాలి చిత్తున వ్రాసినయేర్పాటు. అనుభవము కలిగినకొలఁది సరియగు పట్టికల వ్రాసికొని యందున్న తెఱఁగు నుల్లంఘింపక యే నీవు సంచరింప సమర్థుఁడ వగుదువు.

8. అజ్ఞానులు సోమరులు పనిఁబూనకముందే కొం దఱు క్రమప్రకారము బుద్ధిపరిశ్రమనో దేహపరిశ్రమనో చేసి చేసి మేధావులు సింహబలులు నైరి. వారిమనోరథ విజయకారణము నిరంతర పరిశ్రమాక్రమము. క్రమము రుచి మఱఁగినఁగాని దానియందలి సత్యమవగాహనము కాదు. గడి యారము సరిగాఁ దిరుగుట కేక్రమము కారణమో నీజీవిత నిర్విఘ్నవిజయమునకుం గూడ నాక్రమమే కారణము. ఇన్ని లాభము లున్నట్టి క్రమశిక్షను నీవుపొందితివా, శుచివంతుఁడవై యన్యులకు మార్గదర్శివై పేర్కొనఁదగిన క్రమాభిమానివై ఆరవిశశితారకముగఁ గీర్తివంతుఁడవై వెలయుదువు.

---

# ధర్మము.

"యతో ధర్మ స్తతో జయః."

1. నిర్ణీతవిధాయకకృత్యము లొనరించుట ధర్మము. ఏవి విధాయకకృత్యములు ? జన్మచేత సంఘముచేత నీతిచేత

విధింపఁబడినవన్నియు మానవునకు విధాయకకృత్యములే. అందునఁ బరులమేలుకొఱకుఁ దనమేలుకొఱకు నరుఁడు నెఱపవలసిన వెన్నియో ధర్మము లున్నవి.

2. ధర్మములు కాలవీథిని మేఘము లంబరవీథినట్లు పలురూపములం దాల్చుచుండును. ఒకనిధర్మము మఱియొకని ధర్మము నొక్కటిగాక వేఱువేఱుగ నుండును. ఒకప్పు డీధర్మములు పరస్పరవైషమ్యభూయిష్ఠములు. దేశపరిపాలన మొనర్చువానిధర్మ మొకటి. గృహసమ్మార్జన మొనర్చువాని ధర్మము మఱియొక్కటి. ఉదయంబున ముఖప్రక్షాళనంబు గావించుకొనుట భూనేతకును సేవకునకును సమానధర్మము. శరీరపోషణము మానవధర్మ మని యొక్కవేదాంతి యన శరీరమును శుష్కింపఁజేయుటయే యుచితధర్మమని వేఱొక్కఁడు వాదాడును. సృష్టిలోని యితరము లన్నిటివలెనే ధర్మము విల్లు గట్టుకొని కాపురముండక మార్పు లొందుచుండును. మఱియుఁ గాలానుసారముగ భేదించుచుండును. “జిహ్వ కొక రుచి, పుర్రె కొకబుద్ధి” యన్నట్లు కాలంబున కొక్కధర్మంబు. కావుననే యుగధర్మములు దేశధర్మములు వేఱు వేఱుగ నున్నవి. మానవుఁడు కలిమిలేములతో నిమిత్తము విడిచి ‘ధర్మంచర’ యను నాజ్ఞకు బద్ధుఁడు కావలసినదే.

3. సృష్టిలోని వారెల్ల రెవ్వరిపనుల వారు చేయుచున్నారు. అణువుపని యణువును బ్రహ్మాండముపని బ్రహ్మాండమును జేసికొనుచున్నది. గడియారములోని మరలన్నియు వేని పని యవి చేసికొనుచున్నవి. కావుననే గడియారము

పనిచేయుచున్నది. సృష్టిలోని సర్వము దేని కది స్వధర్మము నిర్వర్తించుచుండెడి కారణముచేతనే సృష్టివ్యాపారము నిర్విఘ్నముగ సాగుచున్నది. గృహములోని యజమానుఁ డాహార వస్తువుల సంపాదించి తెచ్చియు, గృహిణి భర్త తెచ్చినది పచన మొనరించిపెట్టియుఁ దమ ధర్మములం దాము చేసికొనుటచేతనే గృహనిర్వాహక కార్యము చక్కఁగఁ గొనసాగుచున్నది. భూమి సూర్యునిచుట్టుఁ దిరిగి, సూర్యచంద్రులు కాంతి నొసఁగి, గాలి వీచి, పొలములు పండి, పూలు వికసించి, యవి తమ ధర్మములు చేసికొనుచున్నవి. నదులు స్నానపానములకు జలంబు లిచ్చి, నగంబులు ఫలంబులఁ గాచి తమ ధర్మానుష్ఠాన దీక్షఁ బ్రకటించుచున్నవి.

4. ఏ కాలమున కేదేశమున కేసంఘమున కుచితమైన ధర్మము నాకాలమునందలి, యాదేశమునందలి, యాసంఘమునందలి వ్యక్తులందఱు నెఱవేర్పవలయును. అట్లు చేయకున్న వారు మిగిలినవారిచేఁ బరిహసింపఁబడెదరు. అయితే నూతన ధర్మప్రతిష్ఠాతలు సమకాలిక ధర్మభిన్నముగనే ప్రవర్తించి యొగతాళి నాదిని గొంతకాలము పడి, కడ కున్నవారి నందఱిం దమ చెప్పుచేతలలో నుండునట్లు చేసెదరు. ఎప్పుడైనను నూతనధర్మము లీగతినే వెలువడినవి. సాధారణ మానవులు నూతనధర్మము స్థాపించువారల మనుకొని భ్రమపడి తమ కుచితము లగు ధర్మములకు దూర మగుట యవినీతి.

5. ఎవని ధర్మమును వాఁడు చేయకున్నచో నష్ట మేమన వచ్చును? పొద్దునఁ బ్రాఁచినోటినిఁ దోముకొనుట

నీధర్మముగదా! ఆపని చేయకున్న సేగి యేమని నీ వడిగిన ప్రశ్నార్థము- అనఁగా నీధర్మ మగు నీముఖప్రక్షాళనముం జేయకుండుటవలన నష్టమేమి? నోరు కంపుఁగొట్టును. ప్రాఁచినోటితో నేపదార్థముఁ దినినను నీ కసహ్యకర మగును. ఇంతటితోఁ బోయిన మేలే! చుట్టుపట్లనున్నవారికిని నష్టమే కల్గును. అందుచే ధర్మమైనదానినిఁ జేయకున్నచోఁ జేయనివానికే కాక వాని యాశ్రితాదులకుఁ గూడ హాని వాటిల్లును. యంత్రాంగమైన చక్రము తిరిగి తనధర్మము నిర్వర్తింపకుండిన యెడల యంత్రమంతయుఁ గదలక నిలిచిపోవును. ధర్మము తప్పిన వాఁ డొక్కఁడే కాక వాని సంబంధులుగూడ నష్టముం బొందుట సంభవించును. ఎవనిముంగిలి వాఁ డూడ్చుకొనునప్పుడు గదా వీథియంతయుం బరిశుద్ధమగును. దాన వీథిలోనివారికే కాక యూరిలోనివారి కెల్లరకుంగూడ నామయము లుత్పన్నంబులు గాకుండును. ఎవనిధర్మము వాఁడు నెఱవేర్చువేళఁ గలుగు లాభములు గ్రహింపఁ గష్ట మగును గాని యట్లు నెఱవేర్పనినాఁడు గలుగునష్టములు వెంటనే విస్పష్టములగును. సారథియుఁ దురగములు చక్రములు వేని ధర్మము లవి చేసినప్పుడు శకటములు సరిగా నడచును. సారథి దిట్టగాకున్నను, గుఱ్ఱములు లొంగకున్నను, జక్రములు చలన ముడిగినను బండి నడువదు. శకటచలనమున కేబండిభాగమున కది నిజధర్మము నెఱవేర్పవలయును.

6. ధర్మనిర్వాహణమును జేయుట చేయమి యనునవి యున్నవి కాని కొలఁది గొప్పలు శూన్యములు. ఒకఁడు ధర్మ

రక్షణము చేయుచున్నాఁడా లేదా యనే ప్రశ్న కగును లే
దను నుత్తరంబు లున్నవి కాని సగము కాపాడుచున్నాఁ డనుట
లేదు. కొంత కాపాడుటయు ధర్మనిర్వహణము చేయకుండుట
లో నిమిడియేయున్నది. ధర్మరక్షణమున పరిమల్లులువాసి యే
మఱి యున్నను జెడుగు లుద్భవించి ధర్మంబు దప్పుట యను దో
సంగు పొసంగును. ఇంక నధమకీటకము ధర్మనిర్వహణము
స్వల్పమైన దనియు, నుత్తమ భూకాంతుని ధర్మనిర్వహణము
హెచ్చైనదనియుఁ దలంపరాదు. ఇరువ్వరవిషయంబున యో
జింపవలసినది ధర్మము రక్షింపఁబడినదా లేదా యనియే.
ఇం దెవ్వఁడు ధర్మముగ నడువకున్నను లోటే. ధర్మమునఁ
బ్రవర్తింపనివాఁడు సేవకుఁడైనను మకుటమాంధాతయైనను
నొక్కటే యపకీర్తికిని శిక్షకును బాత్రుఁడగును. తొల్లి
యుదరంబునకును దక్కినశరీరావయవంబులకును గలహము
గల్గినది. అవయవము లన్నియుఁ దాము పనిచేయు
చుండ నుదరం బూరక మ్రింగుచున్న దని యెంచి సమ్మె
కట్టి తమధర్మము నిర్వహింప వమ్యెను. నోటినుండి ముద్ద
యందు కొన్నఁగదా కుక్షి పనిచేయుట. నోటికిఁ జేయియుఁ
గడుపునకు నోరును గబళంబును బంపకుండుటచేతఁ బొట్ట తన
ధర్మము నిర్వర్తింపఁజాలకపోయెను. అవయవములును బొట్ట
యు నాహారశూన్యతచేతఁ గృశించినవి. ఏయవయవముధర్మ
మా యవయవము నెరవేర్చినప్పుడు సర్వశరీర సౌఖ్యారోగ్య
ము లొదవు. తక్కిన యవయవంబులు పనిచేసి పొట్టచేయకున్న
ను బొట్ట తనధర్మముం గాపాడఁ దక్కినభాగములు తమ ని

యమితకర్మలంజేయ కున్ననుగూడ దేహసౌఖ్యభంగకరమే. మఱియు నవయవంబుల ధర్మము నీచమైనదనియు నుదరంబు ధర్మము ఘనమైనదనియు భేదంబు లవంబును లేదు.

7. ఏవ్యాపారమం దున్నవానికైనను నిజధర్మములు తెలియును. తెలియకపోయినచో వాఁడవి వెంటనే తెలిసికొనవలెను. తెలియకున్న నా కేమని గర్వింప నధర్మ మొనర్చినవాఁ డగును. అట్లు ధర్మమెఱింగి ధర్మ మొనరింపకున్నచో, నధర్మవర్తనుఁడయి, తన బిడ్డల కధమాదర్శమై వారి వినాశనము నకు హేతుభూతుఁ డగును. ఒకవ్యక్తిలోఁగాని, సంఘములోగాని, యుగములోఁగాని యధర్మము ప్రవేశింప నది కొంతకాలము చెలరేగి నిల్చునుగాని కడకు నాశన మందితీరవలసినదే. మానవున కనివార్యమగు నధర్మము బొడసూపినచో భగవంతుండు మానవరూపముననే యవతరించి ధర్మసంస్థాపన మొనరించును. లోకములో నధర్మ మశాశ్వతమనుటచేత నెప్పటికైన నది లయ మందితీరును. ధర్మముమాత్రము శాశ్వతమై నిల్చును. ఏదేశమున ధర్మమును దక్షులైనవా రుపేక్షింతురో, వారు చేటుం బొందెదరు. దానఁగల దురితము వారల కంటును.

8. ధర్మమూలంబగుట విజయపథంబు మృదుపుష్పమయంబై సులభసాధ్యంబుగాక కంటకావృతంబై దుర్లభంబై యుండును. అయినను నరుఁడు గడచి నడచి గమ్యముఁ జేరిననే విజయమును, విజయుఁడు ధర్మావలంబకుఁడు నను శాశ్వతబిరుదంబులును వానికిఁ గల్గును.

# ఆశ.

శా॥ ఆశాపాశము దాఁ గడుఁ నిడుపు, లేదంతంబు రాజేంద్ర!..

—భాగవతము.

1. మంచివస్తువున కాసపడుట మానవస్వభావము. ఆవస్తువు యథార్థముగ లభించునా లేదా యనునది వేఱుసంగతి. తద్వస్తువు పరకీయమై యుండనగును. దానిఁ బొందుటకు నీకుఁ జిక్కు లుదయింపనోపు. నీకు దాని ననుభవించుటకుఁ దగిన శక్తియు లేకపోవచ్చును. మండలేశ్వరునిశుంఠాలముం గని మనకు నిది యుండరాదా యని తలపోసి దానికి నాశింపవచ్చును. ఱేఁడు తనదంతావళంబును నీ కొసంగునా? దానిఁ ద్రోలుకొనిరా రాజసేవకులు నిన్ను దండనసేయరా? ముందుగా నేనుంగే యంగీకారముం జూపి నీకు లొంగుబాటులోని కరుదెంచునా? ఇన్నియు జరిగినను సాధారణుఁడవు నీ వాగజశ్రేష్ఠమున కొక్కపూటయైన నాహార మిడఁగలవా? ఈభావికష్టపరంపరలవిచారింపకే సుఖమునకు విభవమునకు నాశపడుట ప్రాణికోటికి నైజము. ఏమనఁ బరులచింతచెట్టుకాయల కాజ్ఞయుండును గాని చూపరులయొక్క గుటకల కాజ్ఞయుండదుకదా! కాఁబట్టి రమణీయమై యమూల్యమై యబ్బురమై సుఖదాయకమైన పదార్థంబులు కంటఁబడినవేళ నింద్రియనిగ్రహశక్తియున్న యోగీంద్రులుగాక తక్కుంగల మానవులది యపేక్షించితీరెదరు. తదపేక్షయే యాశ.

2. ఆశ యెంతయో దుర్నివారము. రుచికరంబులగు వంటకంబులు సిద్ధమగుతావులనుండి వెల్వడుతావు లాఘ్రా

ణించువారికిఁ దోరంపుటాస పుట్టించి నోరూరంజేయును. ధని కుం డగు బందుగుని సాహాయ్యంబును బేదచుట్టంబు లాశించెదరు. స్వర్గలోకసౌఖ్యముల నోలలాడుకాంక్షచేతనే కొందఱు యజ్ఞయాగంబు లొనరించెదరు. ఏదో మేలుకలుగునను నాసమెయి నరుం డేకార్యంబైన నొనరించును. విద్యాయశోధన విభవప్రాప్తిపై నాశయే మానవులం బాటుపడంజేయును. ఒక్కొక్కవేళఁ దదనంతరసుఖ మాశించి దుర్మార్గకార్యములు నరహత్యలుకూడ నొనరించువా రున్నారు.

3. ఆశ జీవనాధారము. అన్నివిధములగు నాసలు వర్జించినవాఁ డేపనియుఁ జేయంజాలఁడు, చేయ నవసరమును లేదు. మానియైనవాఁడుగూడఁ బ్రపంచికవైభవముల రోసియు బ్రహ్మసాక్షాత్కారమువై పాశాపాశముచే నీడ్వఁబడుచున్నవాఁడే సుఁడీ! క్రమముగాఁ గక్ష్యలగడచి పైపై కెక్కవలెనను నాశయే వణిక్ఛిఖామణుల నిరంతరవ్యాపారము కొనసాగించును. రాజ్యమునకు రాజ్యముఁ గల్పి చక్రవర్తిత్వమును బొందునాశయే రాజపుంగవులచే యుద్ధములు దండయాత్రలు చేయించును. ఇట్లే ప్రతివ్యక్తియు జీవించి యొక్కొక్కకార్యమే నెఱవేర్చుట కాశయే ముఖ్యహేతువు. తొలిపనిలోని విజయ ముత్తరకార్యములపై నాశఁబుట్టించును. గోవులోఁ బెఱిగెడి కొమ్ముల ట్లర్థసులభతతోఁ దృష్ణ తానును బెఱుఁగును. అట్టియాస లేనినాఁడు మానవులవ్యాపారములన్నియు మాయమై లోకము స్తంభించును.

4. ఆశకు మేరయు సముద్రమునకు లోతును దెలియ నశక్యమని సామెత. జీవితమున కనుకూలములగు గృహారామ క్షేత్రములు నిర్ధని కపేక్షములు. అవి కల్గిననాఁడు సౌధము నధిక క్షేత్రములను వాఁడు వాంఛించును. అప్పుడైనను సుఖమై యూరకుండునా? పదిమేడలు గట్టఁ గోరును. పిదప గ్రామములను గొన నభిలషించును. పిమ్మట సంస్థానాధీశత్వమునకై యత్నములు సాచును. తదుపరి బిరుదము లాకాంక్షించును. భూమండలమంతయుఁ జేఁజిక్కిన రాజేంద్రుఁడుకూడ నేయూర్ధ్వలోకములకో నిచ్చెనల వేయుచుండును. ఏమన నింతద్రవ్యమున్నచో నాశయుడుగునన్న నియమము శూన్యము. అందుచేతనే లక్షాధికారి మొదలు భిక్షాధికారి వఱకుంగల యేనింగన్నను దనయునికిఁ బైగతిం జెంద నుంకించు నాశాంశువే గోచరించును. ఏతత్కారణముననే యాశకు మితిఁ గన్గొను బుద్ధిమంతులూ లేరు. సూక్ష్మయంత్రములూ లేవు. పెద్దవయస్సుతోఁ బాటు మానవుని యవయవములు పటుత్వము దోఱఁగును. గుణములు కొన్ని నశించును. ఆశమాత్రము దినదినప్రవర్ధమానమై యెవ్వేళను బలవత్తమమై యుండును. జరాదికంబుల కీల్గి నరుండు దేహంబు చాలించుచో నాశందప్ప సమస్తగుణములఁ గ్రమముగ విడనాడును. ఆశమాత్రము నరునియొడలునఁ బ్రాణము లున్నంతవఱకు వాని వదలక యంటిపెట్టుకొనియేయుండి, వాఁడు హరీ యన్నట్లు నిశ్చయించుకొన్నమీఁద నాతనిం బాయును.

5. బహుళవ్యాపారఫలముల కేకకాలమున నాశఁ బూనుట మనఃక్లేశహేతువు. అన్నిఁట మానవుఁడు సమానముగఁ జిత్తైకాగ్రత నిల్పఁజాలమి, నన్నియు ఫలవంతము లగు నన్న నిశ్చయములేమిని వాని కెప్పటికైనఁ గొన్నింటనైన నాశాభంగమగుట తటస్థమై తీరును. అప్పుడు వాని విచారాతిశయము వాని యాశాపరిమితి కనుగుణమగు వైశాల్యముం గల్గియుండును. ఒకఁడు ధనము ధనమని యెంత యధికముగా నిలషించునో యంత యధికదుఃఖము నా ధనము లభింపని దినమున నాతఁ డనుభవించును. అధికాశయే శూన్యమైన వేళ మనోరథభంగ ముదయించిననాఁ డధిక విషాదమే యుండనోపదు. గాఢతర మగు నాశాక్రాంతత దుర్లభఫల యగు కొంతో యసహ్యకరము, దుఃఖకరము. ఆశ కొనలు సాగినకొలఁదిని తద్భంగజనితవిచారము నిశితత్వ మూనును. కాఁబట్టి యనమితాశయఁ బెక్కెడలఁ బాఱు నాసగమియు దొఱంగుటచే నరుఁడు సౌఖ్యమును బొందును.

6. ప్రపంచములోని దుఃఖమంతయు నాశాజన్యమైనదే యనవచ్చును. ఏదైనఁ దనకు లేదనుకొనుట దుఃఖకరము. లేనిదానిని బొంద సంకల్పించుట దుఃఖకరము. తత్సాధనము దుఃఖకరము. కడకది చేఁజిక్కినఁ జిక్కకున్నను దుఃఖము. ఇన్ని దుఃఖములకాకరంబైనయాశ దుఃఖాస్పద మనం జెల్లదే! కాఁబట్టి బుద్ధిమంతున కాశపజ్జం బోవమియే సుఖకరంబు. చల్లగనున్న వస్తునిచయంబు గుణసంపత్తితో సంతృప్తిని జెంది నిరాశత్వంబు నొందినజ్ఞాని సంతాపంబు దక్కి సుఖి యగు ననుట నిర్వివా

దాంశము తాటిచెట్టెక్క నుంకింపనివాఁడు నేలమీఁద నే సుఖముగ నుండును. పైకధిరోహించినవాఁడు పలుపాట్లం బడవలెను. వృక్షాగ్రము శ్రమపడి చేరి యచ్చట వాఁడు నిల్వఁ గలిగిన సౌఖ్యావహము గాని, క్రిందికి దైవవశంబునఁ బడెనా యెంత యున్నతి కెక్కెనో యంత పెద్ద దెబ్బ తిని చావవలసియే యున్నది. కాఁబట్టి యాశాపాశబద్ధుఁడు కాక యున్నవాఁడు స్వేచ్ఛావిహారి; స్వతంత్రాధికారి. ఆశించి పొందిన దెప్పుడో పోవును గాని స్థిరము కాదు గనుక దానిఁ దొల్తను నీవే యాశింపక విడిచిపెట్టుట లెల్వ.

7. నిరాశాపరత్వంబున నింకొందు లాభం బున్నది. నిరాశవలన యోగులు సాధించినట్టియు, బుద్ధిమంతులు సాధింపఁ బ్రయత్నించు నట్టియు, నో నరుఁడా! సాధింపు మని వేదాంతజ్ఞు లుద్బోధించు నట్టియు, హృదయసంతాపాగ్ని నార్చు నట్టియుఁ, జేతో మోద మొడఁగూర్చునట్టియు నింద్రియనిగ్రహశక్తి చేకూరును. ఇంద్రియవిజయమున కన్న నధికతమము మగు శిక్ష మానవునకు లభింపదు. ఆ శిక్షయే వానికి సమస్తమును జేకూర్చి మోక్షప్రాప్తి కలిగించును. ఇంద్రియనిగ్రహపరున కాశకన్నఁ బ్రబలశత్రు వేదియు లేదు. అమితతర మగు నోటమి లేదు. దుర్గమతర మగు నంతరాయము లేదు. యతిరాజులు కొంద ఱా శత్రువుముందు నిల్వలేక తపోభంగము గావించుకొనిరను గాథలు పురాణంబుల నందందుఁ గన్పట్టు. కావున "క॥ ఆశయ యింద్రియనిగ్రహ, నాశముఁ బొందించుఁ

గావునం దొఱంగెద నే, నాశను సౌఖ్యము నిచ్చు, నిరాశయ" నక తప్పదు.

8. ప్రపంచములో నుండి ప్రాపంచిక వ్యాపారములం బాల్గొనుచుం బ్రాపంచికసుఖములం బడయ నెంచు సంసార లంపటు లధిక సంఖ్యాకులు. వారిమాట యేమి? అనంగా వారి కాశ కూడునా కూడదా యనునది నిర్ణయము గావింప వలయును. నిరాశ సుఖప్రద మని పాటువిడిచిన మనమందఱ ము క్షణమైన జీవింపంజాలము. ఏ భౌతిక వ్యాపారమును క్షణ ము సాగదు. మానవుండు పరులధనాదికంబుల కాసపహిం చుట దోషంబగుట వానిని జిల్లపెంకువలె నెవ్వండు చూచునో వాండే ధన్యుండు; పూజనీయుండు; స్నేహపాత్రుండు. ఇంక సద భ్యాసములను విద్యాబుద్ధులను సద్గుణములను నలవఱచుకొను పట్లం గ్రమముగాం బైనంగల యంతరవు నారోహింప నెల్లరు నాశింపవలసినదే! కేవల భోగపరాయణులై వినశ్వరపదార్థ సంపాదనముపట్ల నరు లాసం జూపంకుండుటే వినీతి. లక్ష్మి చంచలస్వభావ. అంతలో బీదసాదలు దారుమా ఱగుట ప్రతివ్యక్తికి ననుభవమే. మానవయత్నం, బియ్యెడ దైవంబు తోడ్పాటు లేకున్న, ఫలవంతము కానేరదు. కావునం గుటుం బపోషణమునకు వలసిన ప్రధానపదార్థములు న్యాయంబుగ నందువఱ కాసించి సాధించి తదుపరి తృష్ణ త్యజించి పరితృప్తిం జెంది సుఖంపందగును. ఇచ్చట నెంత ధనమున్నం దృప్తిం బడ యం దగు నన్న నియమాభావ ముండుటయే యాధారము చేసి కొని యెల్లరు నాశల భంగముల మునింగి తేలుట యక్రమము.

మఱియుఁ బశువులను బులుగులను దిలకింపుఁడు, అవి యే ప్రొద్దుతిండి కాప్రొద్దే పాటుపడును. ఆహారము నిలువఁజేసి కొనుట కాశగాని గాదెలుగాని వానికి లేవు. అందుచేతనే వానికి స్వేచ్ఛ. ఆశించి యర్థ మార్జించినవానికి సంతతభయము. కావున నాస గొంతవరకుఁ గొన్నివిషయముల జీవనాధారమే యయ్యు, కూడనియాశ కొఱగాని గుణము.

9. పేరాస దురాశ యను రెండాశాభేదంబులు వాడుకలోఁ గన్పట్టు. వానిని వివరింప నిదియే యదను. పేరాస యనఁగా మిక్కుటమగు నాశ. పేరాస కూడనిగుణము. పేరాస వల దనుటకుం గారణము తదాశ దుర్లభఫలమైన వేళ నీకు మిక్కుటంబగు నుమ్మలికంబు చిత్తంబునం దంకురించుటయే యని పైనఁ జెప్పఁబడినది. పరులధనకనకవస్తువాహనాదికంబులను దనకొలఁది యెఱుఁగక యాశపడుట దురాశ. ఉన్నదానితోఁ దనియక పెఱవారివి రావలెనను యాధిక్యాశసనంబు దురాశ. దురాశ దుఃఖముచేటు. నోటఁ బలలంపుఖండంబు నుంచుకొని కాల్వవంతెనమీఁదఁ బోవు శునకం బొండు జలంబులం దన ప్రతిబింబంబుం గని నీటఁగల కుక్క కొనిపోవు నామిషఖండంబున కాశించి నోరుదెఱవ నేమయ్యెనో సువిదితమే! పరులసొమ్మునకాశింప నున్నదియుఁ దొలంగెననుట దురాశవల దని ప్రకటించుటయే.



## పాటు.

'కృషితో నాస్తి దుర్భిక్షమ్.'

సీ॥ తలకొన్న పనుల సాంతంబుగాఁ జేసిన
ఫలమునఁ దలపెట్టఁ బనులు గల్గుఁ
బ్రారంభమం దహోరాత్రము ల్పని నేర్పు
ఫలమునఁ బని నేర్పుపదవి వచ్చుఁ
దొలికష్టములఁ జూచి తొలఁగక పనిసేయు
ఫలమున సంతోషభాగ్య మబ్బు
శ్రద్ధతో మొదలంటఁ జక్కఁగాఁ బనిఁబూను
ఫలమునఁ గీర్తిసంపదలు ప్రబలు

ననుభవముచేఁ దెలియునగు ననఁగరాదు
పనులు చేయంగ లభియించు ఫల మిది యని
మొదలు విసుగయ్యుఁ బనులిచ్చుఁ దుదకు సుఖము
పనులఁ జేయుము సోమరితనము మాని.

1. నరుఁడు తన శారీరక మానసి కాధ్యాత్మిక శక్తులను నిజోపయోగమునకుఁ గాని పరోపయోగమునకుఁ గాని యుపయోగించుట పాటు. అనఁగా నుపకారకర మగుపని యేదైనఁ బాటే. పాటుపడుట మనుజునివిధి. ఆధర్మము నెఱవేర్చి పాటుపడువాఁడు సన్నుతి కెక్కును. పనిపాటులు నేర్వని స్త్రీ నిష్ప్రయోజనము, గృహనిర్వాహకమున కనుపయోగ మని నిందింపఁబడు చున్నది. కావునఁ బనిపాటుల యవసరము నొకించుక గ్రహించుట యెల్లరకు సమంజసము.

2. మానవశరీరనిర్మాణము పనిపాటు లొనరించుటకు వీలైయున్నది. నరములు కీళ్లు కండరములు కదలిక కనుకూలములై యుండి పాటుపడు మని నరునిఁ బ్రబోధించి ముందునకు గెంటుచున్నవి. వానిబలమే నరుని బలము; వాని క్షీణతయే నరుని క్షీణత; వాని వృద్ధియే నరుని వృద్ధి. వానినిఁ బెంపకున్నవాఁడు తన్నుఁ దాఁ బెంచుకొననివాఁడే సుఁడీ! కావున నరుని పెంపునకుఁ బాటు ముఖ్యసాధనము. మఱియుఁ బాటుపడుట మనుజునకు నైజము. అప్పుడే భూపతనమైన బిడ్డ కాలుసేతులు పైకెగుర వేయును. పిన్నవయస్కు లొక్కచో నిల్వక సదా సంచార మొనరించెదరు. వా రొక్కెడ బంధింపఁబడుట కొల్లరు. ఏమియు లాభము లేకపోయినను వారు దేహమునకో బుద్ధికో లేదా రెండింటికో పరిశ్రమ కలిగించుచుందురు. చిత్తైకాగ్రత వారి కుండదు; రుచింపదు. బాలకుల మనఃఫలకచిత్రితాంశములు చిత్రవిచిత్రభంగుల మార్పు లందుచుండును. వారినోరు మాటాడుచునే యుండును. కాలు కదలుచునే యుండును. వారు నిల్చినచోట నిల్వక యొకచోటనుండి మఱొక్కచోటునకుఁ బర్వెత్తుచుండెదరు. కత్తి చేఁబట్టి చెట్లు చేమలు నఱకు వ్యాపారమున మగ్నులగుదురు. జ్ఞానము వచ్చియురానినాఁడే యీరీతిని బ్రవర్తించెడివాఁడు పెఱిఁగి పెద్దయై సోమరితనము నాశించుట యకార్యకరణ మని, పాప మని, నేర మని నిస్సందేహముగ వ్రాక్రువ్వనగును. వయస్సునను న్నవారుకూడఁ బాటుతత్వము

గ్రహించి తమశరీరభాగము లేపాటునిమిత్తము పుట్టినవో యా పాటు వానిచేఁ జేయించుట యవసరము.

3. ముహర్షులఁ గుడిచి యేపనులఁ జేయకుండఁ గూర్చుండి బ్రదుకు జీవితమే ఘనమైన దని, యాకాంక్షింపఁ దగిన దని, యనేకు లమాయకులు తలపోయుదురు. వారిది తప్పు డభిప్రాయమగుటఁ దదభిప్రాయనవరణము కర్తవ్యము. ప్రపంచములో సోమరుల ప్రశంసించుట ప్రోత్సహించుట కంటెఁ బాపకార్య మన్య మేదియుఁ బొడసూపదు. మానవుఁడు గౌరవింపవలసినవాం డిద్దఱే యనియు, నందు మొదటివాఁ డాధ్యాత్మికజీవితవృద్ధిఁ గావించువాఁ డనియు, రెండవవాఁడు శరీరపరిశ్రమము చేయువాఁడనియు నొకమహాత్ముఁ డనెను. ఇంతకు మించి యితరుఁ డెవ్వఁడును గౌరవార్హుఁడు కాఁజాలఁ డనియుఁ గూడఁ జెప్పెను. మఱియుఁ బాటుపడని దేహము రోగములకాణాచియై దేహికి విశేష మగు నలసట గలిగించును. ఒక్కచో స్థాణువువలెఁ గూర్చున్నవాని కాళ్లు గుదులుకట్టి బాధ కలిగించును. కండరములు కదలక రక్తప్రసారము మాంద్య మగును. నిద్రయు నావులింతలు గల్గి దారిద్ర్యలక్షణము లుప్పతిల్లును. వేయేల మందుఁడై యానరుం డుండును. అట్టితఱి నొక్కసారి విసవిస నరక్రోశము దూరము నడచివచ్చిన వాని కా దారిద్ర్యలక్షణములన్నియుఁ బటాపంచలగును.

4. ఏ యవయవము పాటుపడదో యా యవయవము దుర్బలమై నీవు కోరినవేళఁ బనిచేయదు. కావున దార్ఢ్య

మున్నంతకాలము నీవు పాటుపడవలయును. ఆపాటు మేనఁ బెఱుగు శక్తియున్ననాఁటి తాత్కాలికోపయోగము నిమిత్తమేకాక, పెఱుగు శక్తి యుడుగునాఁటి వృద్ధాప్యోపయోగమునిమిత్తముకూడ నైయున్నది. లేఁబ్రాయమునఁబాటుపడనివా రెండవ కాలము రాకుండఁగనే దుర్బలులై చెడిరి; నడిమివయస్సులోనే పరలోకగతులైరి. వారిస్థితిని గాంచియైనను దార్ఢ్యముతోఁ జిరకాలము మను నిమిత్తమైనను, వయస్సుతో సంబంధము లేక యెల్లవయస్సులవారును బాటుపడుచుండవలెను.

5. మహాబుద్ధిశాలి పాటుపడఁడనియు నాతఁడు సహజజ్ఞానసంపన్నుఁడనియు లోకములోఁ బ్రఖ్యాత మగు నమ్మకమున్నది. వాఁడు సాధారణముగా మానవబుద్ధి కందని కార్యము లద్భుతముగ క్షణములోఁ జేసె నని చెప్పుకొనుటయుఁ గలదు. ఆతఁ డే విషయమైనను త్రుటిలో గ్రహించి చిరకాలము జ్ఞాపక ముంచుకొనుటయేకాక చిక్కుసమయములలో బహుళోపాయములు చెప్పుననియుఁ బాండిత్యపరికర్షముతో మాటాడుననియు నుచితప్రవర్తనము గమనించి సంచరించుననియుఁ గూడ నమ్మిక యున్నది. కాని నిజముగ బుద్ధిశాలురజీవితము లొకటి రెండు నీవు నిదర్శనమునకుఁ బరీక్షించినచోఁ గన్పట్టునది వారియం దున్న పాటుపడఁగలశక్తి యితరులయందునకంటె నధికతరమై యుండుటే సుమీ! అమితమైన పాటుపడుశక్తిగలవాఁడే మేధావి యగును. వ్యాసుని వంటి యొక్కొక్కకవి వ్రాసిన గ్రంథసంపుటములన్నియు

భావపుంజములతోడను బదగుంభనములతోడను నర్థగాంభీర్యముతోడను రసమాధుర్యంబుతోడను దులదూఁగుచుండును. అవి చదువుటకు మానవునకుఁ దనజీవితము చాలదు. అట్టి మహోత్కృష్టములగు గ్రంథములు గాకున్నమానె సంఖ్యకైన నరిపోవునన్ని గ్రంథములు వ్రాయుటకు సాధారణకవిరాజుల కేండ్లుపూండ్లు పట్టును. తాము మేధానిధు లొనరించు కార్యములు చేయనేరనివార లాపనులచుట్టు నద్భుతములగు కథలఁ గల్పించెదరు. కలమాట చెప్పవలసి వచ్చిన యెడల సోమరులు నిద్రించువేళ నా మేధానిధులు నిరంతర పరిశ్రమ చేసి రని యే చెప్పవలసియున్నది.

6. ఓర్పుతోడను బట్టుదలతోడను గ్రమముగఁ బాటుపడెడువాఁడు సామాన్యమానవాతీతకృత్యము లెన్నియో నెరవేర్పఁగలఁడు. సోమరులకుఁ బిఱికిపందలకు నిది పరిహాసకరముగ నుండును. ఘను లెల్లరు పాటుపడియే తన్నామ మార్జించుకొనిరి. సోమరికిఁ జేయఁ బను లే కానరావు. పనిప్రారంభము చేయువాని కన్నియుఁ బను లే. ఒకపనిలో నవాంతరముగ నితరకార్యములయాచరణమున కవకాశము గల్గును. పాటుపడి యొకపని చేసి తత్ఫల మనుభవించువాని యానంద మవ్యాజమై యద్వితీయమై యలరారు. పరులపాటుఫలము నీ వనుభవించునాఁడా యానంద మేమాత్రముం గలుగదు. నీయంతట నీవొకపని చేసితివా యం దెన్నిలోపము లున్నప్పటికి నది నీకిచ్చుసౌఖ్యము పరుఁడు చేసిన దెంతయందముగా నున్న నది గలిగింపఁజాలదు. శ్రమపడి యొకలెక్క చేసి చేసి, కడకు ఫలిత

మందిన గణితశాస్త్రజ్ఞునిహృదయానంద మాతనిగ్రంథము నుండి లిక్కికి లిక్కి మక్కికి మక్కిగ వ్రాసికొనినవాని కల వడునే? అదృష్టమువలన నకస్మాత్తుగఁ గలిగెడిసుఖములకంటెఁ బాటుపడుటవలనఁ దోఁచుసుఖము లెక్కుడు విలువదైనవి. పాటుపడు జనులు పనులఁ జేయుచుఁ పాటలు పాడెదరు. ఆపాట వారియాయాసవిధ్వంసి, ఆనందచిహ్నము. నిపుణుఁడగు పని వానిపాటులో లయ యున్నది. నిపుణతగల కంసాలి సుత్తె దెబ్బలలో లయకలిమియు, చేతకానివాని చేతిసుత్తెదెబ్బలలో లయ లేమియు మీ రెఱింగినదే.

7. పాటువలన పనులు సుకరము లగును. పాటువలన నద్భుతముగ దుర్లభ కార్యములన్నియు లభ్యము లగును. అందు వలననే 'కష్టే ఫలీ'యను నుడి పుట్టినది. బండ్లను లాగి, బట్ట లుదికి, కట్టెలఁ గోసి, పొలముల దున్ని, పంట పండించి, వస్త్ర ముల నేసి సుఖ మొడఁగూర్చునది పాటు. ఆధునికప్రపంచపు సౌఖ్యమంతయుఁ బాటుపై నాధారపడి యున్నది. సుఖకర మగు గాఢనిద్ర పాటుపడువానికింగాక సోమరి కబ్బదు. శరీర సౌష్టవము పాటుపడువానికిఁ గాక సోమరికిం గల్గదు. బహు లాభముల సమకూర్చు మంత్రశక్తి పాటు. శ్రమలఁ బాపి సుఖ మొడఁగూర్చు మాయ పాటు. ముడిపదార్థముల నుపయోగ కరమగు వస్తునిచయముగ మార్చు నైంద్రజాలికము పాటు. మంటినిగూడ బంగారమొనరించు పరుసవేది పాటు. అట్టి పాటు గౌరవింపఁబడవలసినదిగాని గర్హింపఁబడవలసినది కాదు.

8. శారీరకమానసికాధ్యాత్మికవిషయములం దెద్దాని విషయ మగు పాటైనను గౌరవనీయమయినదే. ఏవ్యక్తి

పాటుపడునో వాఁడు సుఖములం బడయును. ఎవ్వఁడు పాటు నొల్లక సోమరియై సుఖములం బొందఁగోరునో వాఁడు తుదకు సుఖములకు దూరుఁ డగును. ఏపాటుదప్పిన సాపాటు దప్ప దని చెప్పుపాస్యవచన మున్నది. సాపాటైనను బాటుపడువానికి రుచించి మేలొడఁగూర్చునుగాని పాటులేనివాని కదియు సంతోషబలముల నియ్యదు. వ్యక్తులకు వర్తించున దే దేశములకును వర్తించును. ఏదేశమున జనులందఱు పాటుపడరో యాదేశమున దారిద్ర్య మిల్లు గట్టుకొనును. ఏదేశమునఁ బ్రజలు రాత్రిందివము లనుక్షణము వ్యర్థముచేయక పాటుపడెదరో యాదేశమున లక్ష్మి నివాసమొనరించును. పాటువంటి దన్యము లే దని ఘంటాపథముగఁ జెప్పనొప్పును. కాఁబట్టి పాటు పడుఁడు! పాటుపడుఁడు!! పాటుపడుఁడు!!! పాటే మీకేభంగ పాటును గల్గనీయక సర్వోద్యమంబుల విజయము సమకూర్చును. పాటుం బ్రేమించుటే దైవమును బ్రేమించుట. వ్యక్తులు గతించినను వారిపాటుఫలితములు వంశపారంపర్యముగ జను లనుభవింప నిల్చియుండును. పాటు ప్రయోజనకరము; వాంఛనీయము; గౌరవప్రదము.

---

## డాబు.

1. తనయందు ఘనతలేనిది ఘనత యున్నట్లు గోచరింపఁ, దా విద్యాగంధమెఱుంగనివాఁడయ్యు విద్వాంసుని పగిదిఁ దోఁచ, ధనవిహీనుఁడయ్యు శ్రీమంతుఁడువోలెఁ గన్పట్ట

నరుఁడు చేయుప్రయత్నము, వేయువేషము, వాగానుభావ మొదలగునవన్నియు డాబు. డాబు విశేష్యమేకాని, వాఁడు కలో బడాయిమాటలఁ జెప్పెననుటకుఁ, జేతకాని ప్రజ్ఞలు వలికె ననుటకు 'డాబె' నను క్రియారూప మున్నది. అందునను వాఁడు డాబె నన్నప్పుడు డాబుమాట లాడె ననియే యర్థము కాని డాబుపరిపనులఁ జేసె నని యూహింపవలనుపడదు. ఇఁక వాఁడు డాబుచేసెనన్నచో మనోవాక్కర్మల దేనిచేనైనఁగాని యన్నింటిచేఁగాని డాబుచేసినాఁ డనియే యెంచుకొనవలయు. అనఁగా డాబుచేసెననుట విపులమైన యర్థమునను, డాబె ననుట సంకుచితమైనయర్థమునను వాడుకమాటలయందుఁ బ్రయోగం బున్నది.

2. అధికస్థితిలో నున్నవారివలెఁ దాను గావలె ననికాక, తా నున్నట్లు గన్పట్టవలె ననూ సంకల్పమే డాబున కుత్పత్తిస్థానము. తా నధికుండైనట్లు తన్ను వినువా రల్పులైనట్లు డాబులరాయఁడు భ్రమపడును. నిజమైనలోకజ్ఞానము లేమియే డాబునకు మూలము.

3. ఎల్లరును డాబుచేయరుకాని డాబుచేయువా రన్నికాలముల నన్నిదేశముల నున్నారు. పేదవాఁడు మొదలు ధనవంతునివఱకుఁ గలయందఱిలోఁ గొందఱు డాబుచేయుదురు. అనఁగా దమయథాస్థితికంటె నధికతరస్థితిలో నున్నట్లు గోచరింపఁ బ్రయత్నించెదరు. నరుఁడు డాబుచేయువేళ నిజలోపనిగూహనమో, తనయందభావమైనయౌన్నత్యనటనమో రెండునో యుండితీరును. కష్టసుఖములు, కలిమిలేములు

రోగారోగ్యములు జీవుల కబ్బుట సాజముగుటచే నందుఁ గష్ట
ము, లేమి, యామయము వచ్చినప్పు డెవ్వండును వానినిఁ గప్పి
పుచ్చి, సుఖము, కలిమి, యారోగ్యము ననుభవించుచున్నట్లు
నటింపనక్కఱ లేదు. ఉన్న దోసంగుం దొలంగించుకొనుటకై
కడంగక, దానిఁ దాఁచుకొనుటయే గొప్ప యని యెడందం దల
పోసి, యంతటితోఁ దనియక, నిజముగా లేనిసుగుణసంపత్తి
యున్నట్లు నటించి మురిసి డాబుచేయఁ బ్రయోజన మేమి? కడ
గండ్లలో నుండియు భోగివలె మసలి దారిద్ర్యమున మున్గియుఁ
జాకలినుండి యుద్దెకు గొన్న చలువమడతలమడువుల బెడబెడల
వినిచి, రోగపీడితుం డయ్యుఁ బరులతో సంపూర్ణారోగ్యవంతుఁ
డట్లు మెలఁగి, తలమునక్కలగు ఋణములపాలయ్యు ఋణదాత
రీతిఁ దిరిగి, నిరక్షరకుక్షియయ్యుఁ బట్టభద్రునివలెఁ బ్రవర్తించి
డాబుచేయుట యెందుకొఱకు?

4. ఎదుటివానిని మోసగించి తాత్కాలికముగ వానిని
నమ్మించి వానివలన నేదియో లబ్ధి పొందుటకుఁ గొందఱు డాబు
చేయుదురు. నీవు పేదవై ధనాపేక్షితుఁడవై నప్పుడు సంప
న్నునియొద్దకుఁ బోయి యొక్కరూపాయి నీ కిమ్మనిగాని బదు
లిమ్మనిగాని వేడితివా యాతఁ డీయఁడు. అట్టియెడ నీవు ధని
కునివలె వేషము వేసికొని, నీ కంతకుఁబూర్వము పరిచయ
మంతగా లేని ధనికునిఁ జేరి, లక్షలతో నీకు వ్యాపారమున్నట్లు
డాబుమాటలు చెప్పి, మాటలమధ్య వేయిరూపాయిలనోట్లు
మాత్రమే దగ్గరనున్నట్లు, చిల్లర లేనట్లు నోరుజారవిడిచి చివరకుఁ
బదిరూపాయిలు గంటలోఁ దిరిగియిచ్చివేయుపద్ధతిని జేబదు

లిమ్మని యంటివా, నీ కాసాక్ష్యం లభించును. అనఁగా డాబుచేసి నీకోర్కె నెఱవేర్చుకొనఁగలైదవు. ఈవిధమున నేసమయమున కుఁ దగినరీతి నాసమయమున డాబుచేసితివా కొంతవఱకు నీమనోరథములు తొలుత సఫలము లగుచుండును. దొంగ సాక్ష్యములఁ బొల్లుపోసికొనువాఁడవయ్యు గృహస్థులయిండ్ల భోజనపుసమయమునకుఁ జేరి దైవభక్తి యుట్టిపడినట్లు, నింటి లోనివారి చెవులు చిల్లులుపడునట్లు రామనామస్మరణ చేసితివా మనస్సుకరగి యింటియజమానుఁడు నీ కాపూటకు భోజన మిడును. ఇల్లు సెలవులలోఁ బల్లెలకుం బోయి వెఱ్ఱిపాలము కాపులఁ జేరి నీవు గొప్ప రాజకీయోద్యోగివలె నుచ్చరించిన చో, వారు నమ్మి నీకు ముంజెలు తెచ్చి ఫలాహార మిడెదరు. సమయోచితముగా డాబుచేయువానికిఁ గొంతవఱకుఁ బ్రథమమునఁ దనప్రయత్నములవిజయమే చేకూరును.

5. కాని డాబులరాయనియాటలు సాగనిఘట్టము లున్నవి. పరిచితులముందు డాబు మొదలే సాగదు. అందు చేతనే డాబుచేయువాఁడు పరిచితులకంటఁబడినప్పుడు దొంగను దేలుకుట్టినట్లూరకుండును. లోకజ్ఞానముగల గడుసరులముందు డాబు చెల్లదు; ఏమన మనుష్యుని జూచినంతనే వారిగుట్టు మట్టులన్నియు నాగడుసరులు లాగెదరు. వీరికిందోముగఁ బెంకె తనముగలవారినిఁ జెప్పనగును. పెంకెవారు తా మాడినన్నమా ట నెగ్గించుకొనుట ప్రధానముగ గణించెదరు. అట్టివారియెడ డాబుచేయువాని యదృష్టమునుబట్టి జయాపజయంబులు సిద్ధించును. డాబులొల్లనివారిదగ్గర నితరులడాబు వ్యర్థము. నల్గురు

చూచుచుండఁ బేరుకొఱకు దానములు విరాళములు నొసంగ నిచ్ఛగించునివ్యక్తులసన్నిధిని డాబుచేయుట బూది నాజ్యము ప్రేల్చుటయే.

6. డాబుచేయువాఁడు కొంతకాలము యథేచ్ఛగా వర్తింపఁగలఁడు. కాని యెప్పుడో పాపము బ్రద్దలైనట్లు వాని గుట్టు వెల్లడికాక తీరదు. వానిపరపతి నాటితో సరి. దేనికైన జన్మస్థితిలయములకొ్రమ మనుల్లంఘనీయముగదా! పైనఁజెప్పిన చొప్పున మొలకెత్తిపెంపైనడాబును గూలక తీరదు. డాబుతో యశోధనాదికముల గడించుట చీట్లతో భవనముగట్టుట. నిలిచినంతకాల మామందిరము లోక మెఱుంగనిబిడ్డల కానంద హేతువై కన్నుల కింపుఁ గూర్చును. కాని కొనయూపిరి తగిలి నప్పటికి నది నిలువక నేలమట్ట మగును. అట్లే డాబు సాగినంత కాలము తదనుసరణకర్తను బట్టఁ బగ్గము లుండవు. పల్లవించినడాబు వెల్లడియైనదా, వాఁ డేమాత్రమేని సిగ్గుబిడియము లున్నవాఁడైనచో, మఱి మొగమైనఁ జూప సిగ్గిలి పదిమంది మాటుమణఁగిన పిదప నూరు దిరుగవలసినవాఁ డగును; డాబు చేయుటకు పూర్వ మున్న సామాన్యస్థితింగూడఁ గోల్పోయి యథఃపాతాళదుస్థితిం బడును; ఉన్నగోడు చెడ వాఁడు మఱి లేవఁజాలఁడు. పదిమందిలో గౌరవము పోఁగొట్టుకొనును; ఎల్లర మెగతాళికిని లక్ష్య మగును. వానిమాటవిలువ నశించును. వానికి మనోవ్యాకులత గల్గును. సిగ్గుబిడియములు లేనివాని కీతిట్లు దున్నపోతుపైఁ గుంభవృష్టి. కాన వాఁడు మఱియొక యూరఁజేరి డాబు సాగించుచునే యుండును.

7. డాబుచేయుట యనఁగా మోసముచేయుట. నిష్కల్మషహృదయులను వంచించుట. అట్టివారిధనము నాకర్షించుటకుఁ బన్నిన వల డాబు. క్రొత్తవారును నమాయకులును డాబునకుఁ బడిపోయి ధనము గోల్పోవుదురు. డాబుచేయువాఁడు తోడివారి కన్నులు మూయఁగల్గునే గాని సర్వాంతర్యామికన్నుల మూయఁజాలఁడుగదా! అనఁగా డాబుచేయువాఁడుపాపభీతిలేనివాఁ డని చెప్పనొప్పును. ఏమన డాబుచేయుట యసత్యమున కొడిగట్టుటయే. మఱియు డాబునకు నసత్యమునకు నొక్క సామ్య మున్నది. ఒక్కకల్లయాడినవాఁడది కప్పననేకములు కల్ల లాడినట్లే యొక్కసారి డాబునకు దిగినవాఁడది నిలుపుట కెన్నియో డాబుపనులఁ జేయవలయును. డాబునకుఁ దాల్చిన యున్నతస్థితి కుచితముగ ధనముకూడ వెచ్చింపవలసివచ్చును. ఇతరులను జాటున యాచించుచు వారి పరోక్షమునఁ దానే వారికిఁ బోషకుం డట్లు పలుకాడ నుద్యోగించును. పలుపాట్లఁ బడును. అప్పుల కుప్పయై మేడిపండుగౌరవము, నేతిబీరకాయసామ్యము పొందును. వానిపాట్లు బరమేశ్వరునకే యెఱుక.

8. డాంబికుఁడు మనస్స్థిమితముం గోల్పోయి స్వేచ్ఛలేక సంచరించును. ఇతరులు తన్నుఁ దక్కువవాఁ డనుకొనుచున్నారేమో యని వానికి సర్వదా భయము. అందుచే నితరుల మెప్పువడయు వేషముల ధరించును. దొంగవారినామస్మరణచేయు డాబుసరివాఁడు వినువారు మాటాడుచోఁ దన కంఠము తగ్గించి వారిముక్కులకుఁ జెవు లొగ్గుచుండును. డా

బునకు దుస్తులను ధరించినవాఁడు ప్రజలదృష్టి నాకర్షించు
నట్లు కొంగుల సద్దుకొనుచుండును. మహాగ్రంథములఁ జదివి
నట్లు వినికిడివలనఁగొన్నమాటల దొరలించును. దూరమం
దున్న ప్రసిద్ధోద్యోగియులనామముల నేకవచనములోఁ బ్ర
యోగించి వారెల్లరు తనకు దాసులై యున్నట్లు వాక్రుచ్చుచుం
డును.

9. డాబు తగనియెత్తుగడ యగుటచేతను దలకు మిం
చిన ప్రయత్నము హానిచే టగుటను డాబుచేయుట దుఃఖమును
గొనితెచ్చుకొనుటయే యని విశ్వసింపఁదగును. ధనికులట్లు
గాన్పింప నెరవునఁ గలలో మునిసి యని పోవఁ గడకుఁ బూర్వ
పుబలుకుబడినిగూడఁ బోఁగొట్టుకొని యెందఱు పరులనవ్వు
లపాలైరి. పులితోలు గప్పుకొనిన గార్దభము దర్పమును,
నెమలిపింఛమును ధరించి మెఱసిన వాయసము గర్వమును
దుద కేరీతిని బరిణమించెనో విదితమేకదా! స్త్రీలమొగుల
బీరములు పల్కిన యుత్తరుని పోటుమానిసితనపుమాటల
డాబు శత్రుదళదర్శనమాత్రమున రూపుమాసినది. ఉత్తర
కుమారప్రజ్ఞలన్నమాట లోకోక్తియై యిల్లుకట్టుకొని సుస్థిర
ముగ నిల్చినది. చీడయంటినను సిరియంటదన్నట్లు డాబుచేయు
వారి కుత్తరకుమారునిపరాభవమే యబ్బును గాని వాని
పేరట్లు తమనామములు శాశ్వతములుకానేఱవని నమ్మితీర
వలయును.

10. డాబసురవృత్తి; మోసకార్యము; నిష్ఫలవ్యా
పారము. అది పెక్కుకట్టుల కిక్క. కాఁబట్టి నీపూర్వుల

నిరాడంబరచారిత్రములఁ బఠించి, నీప్రస్తుతస్థితిగతుల గమ
నించి, దేశకాలపాత్రములమార్పుభంగి నెఱింగి, తగినమాత్రపు
వేషములతో, ననుకూలంపు టెత్తుగడలతోఁ బౌర్వాపర్యం
బు విచారించి నిష్ప్రయోజనకరము లగు డాంబికవ్యాపార
ములు విడిచి డాబునకుఁ బరాచీనుఁడవై మెలంగి సుఖింపుము.



# నడత.

1. 'ఒకఁడు గుణముగలవాఁ' డను వాక్యములో గుణము
నకు మంచిగుణ మనియుఁ జెడుగుణ మనియుంగూడ నర్థము
జెప్పుకొనుట కవకాశమున్నట్లు దోఁచుచున్నను, గుణమున
కియ్యెడ మంచిగుణ మను నర్థమే రూఢి. అటులనే నడత యని
నప్పు డున్మార్గప్రవర్తనముగాక సన్మార్గప్రవర్తన మనియే స్థిర
పఱచుకొనునది. వృత్తము, ప్రవర్తనము నడతకుఁ బర్యా
యపదములు. వీనికిముందు మంచియని గాని తదర్థమిచ్చునట్టి
గాని యుపసర్గఁ జేర్చుకున్నను సద్వర్తన మనియే యవి యర్థ
మిచ్చును.

2. ప్రవర్తనము మంచిదైనవాఁడు పూజ్యతఁ గాం
చును. ఒకనినడత వానిశీలము ననుసరించియుండదు. అంత
మాత్రమున వర్తనమునుబట్టి యోగ్యతానిర్ణయమునకుం
గడంగుటకు వీలుకాదు. శీల మంతస్స్థితము, వృత్తము బహిర్వ
ర్తనము. తొలుతఁ 'గన్నుల కింపైనఁ గడుపున కింపగు' నన్న
మాట నీప్రవర్తనముపట్ల నుపయోగించి చెప్పుము. ఒకనివృత్త

ము నీకన్నుల కింపైనచో వానిశీలమువిషయమై నీకు సదభి
ప్రాయము పుట్టును. మార్గస్థుఁడు దప్పిఁగొని దారిలోనున్న
తాళవృక్షమునీడఁ గూర్చుండి, చేతఁగలపాత్రిలోని పాలఁ గ్రో
లు ననుకొనుఁడు. ఆతనివృత్తము దూరమునుండి కనినవాఁడా
పాంథుని ద్రాగుఁబోతనుకొనును. కాని వానిపరిస్థితులలో నట్టి
వాని యమలశీలమునకుఁ గళంకమాపాదింప దని యూహిం
చుటకుం దగినంత వ్యవధి, ప్రేమ, సానుభూతి, లోకమున కుం
డునే? కాఁబట్టి ప్రతివ్యక్తియుఁ దన ప్రవర్తనము దిద్దుకొన
వలసియున్నది.

3. నలుగురిలోనున్నపుడు వాఁడు మెలఁగురీతియే
నడత. అది తృప్తికరముగను జనరంజకముగను నుండవల
యును. నీతులని పెద్దలుచెప్పు కొన్నిటిని వినుఁడు. అవి యను
సరించితివేని నీవర్తనము బాగుపడును. పెద్దల సముచితప్రకార
మునఁ బూజింపుము. సర్వభూతముల సమప్రేమమునఁ జూ
డుము. పరిచితులు కంటఁబడినప్పుడు నమస్కరింపుము. ఉప
కారికిఁ గృతజ్ఞతఁ జూపుము. ప్రతివాక్యాంతమందుననో, మధ్య
నో, 'తమదయ' 'తమయాశీర్వచనమువలన' ననునర్థమిచ్చు
పలుకుల గౌరవపురస్సరముగాఁ దొరలింపుము. ఈమాటల
వలన నీకు వీసమైన నష్టములేదు కాని యామంచిమాటచేయు
కార్యము లక్షవిలువ యుండును. పరులపల్కుల నాలించి
నపు డవి నీయభిప్రాయానుకూలములైనను గాకున్నను గోప
మూనరాదు. సర్వదా చిఱునవ్వుతో వానిఁ ద్రోసివేయుము.
హాసన్ముఖ మెదుటివారిని హాసన్ముఖులఁ జేయును. ఆలోచనా

నిమగ్నులను గాఢనిద్రాపరులను లేపెడి కాలిచప్పుటితో నడచుట, వదరుట, నిన్నుఁగనవచ్చినవారి కాదరపూర్వక స్వాగతం బొసంగకుండుట, క్రొత్తవారి నెదుటఁ బస్తుంచి నీవు ముందుగఁ గుశుచుట, నీవెంత కొమ్ములు దిరిగిన ఘనుఁడవైనను నీ కుపకారకర మగు పనిచేయు నితరులను దరియక, రమ్మని వారికివార్త నంపుట, యధికారి నని యితరులఁ దూలనాడుట, దుష్ప్రవర్తన మనఁబడును. ఇందులకు వ్యతిరిక్తంబైనవన్నియు సత్ప్రవర్తన నాఁ బఱగును.

4. నడత మంచిదైనవాఁడు వేకువను లేచి, కాలకృత్యముల నిర్వర్తించుకొని నియమానుసరణముగ సొంతపనులఁ జేసికొని సాయంకాలమున కిల్లుఁజేరి సాపడి నిద్రపోవును. వీలైన నితరుల కుపకార మొనరించును. లేదా తటస్థుఁడై మిన్నకుండును. ఇతరులవిషయమై లేనిపోనిసంకోచములఁ జెందఁడు. ఒకనియొద్ద విన్నమాట లచ్చట నే మఱచును. రెండవవాని చెవి నేయ నుంకింపఁడు. ఎల్లరకుఁ జెవియొగ్గునుగాని యెవ్వనికి మాటనీయఁడు. ఆడంబరజీవన మొల్లక యున్నతాలోచనలు సేయును, లేనిపోని యెత్తుగడలతో నప్పులపాలు కాఁడు. ధనమునకై యాసపడి యకార్యము లాచరింపఁడు. సత్యప్రతికూలవాక్యము లాడఁడు. పేచీలకుఁ బెదబాబు కాఁడు. ధన మార్జించుకొనినను దానిపై గుప్పిటఁ బెట్టుకొనునే గాని హృదయకుహరమందు దాచుకొనఁడు; పొగఁబీల్చుట వంటి యసభ్యకార్యముల నేవగించి వానికిఁ బరాఙ్ముఖుఁడగు; తలవంచుకొనియే వీథి నరుగును; పనిగలవారితోడనే ప్రసం

గించును; వ్యర్థకాలహరణానురక్తి కెడమగుటచేఁ దనకాల
మునుగాని యితరులకాలమునుగాని నిరుపయోగముగ గడప
నంకింపఁడు. అవసరమున కుపయోగపడు వస్తునిచయ మింటఁ
జేర్చుకొని యెవ్వేళల సంసిద్ధుఁడై యుండునుగాని, కావలసి
నప్పుడు పర్వులెత్తి కలియఁ ద్రొక్కుకొనఁడు. పరులు నొచ్చు
న ట్లెదురాడఁడు. అందుల కడ నబ్బినప్పుడు శాంతముగ హిత
బోధసేయునుగాని తనమాట నెగ్గినదనుప్రగల్భములఁ బల్కఁ
డు. ఎంతైనఁ దనకే యోటమి చేకూఱినప్పుడు, దిగులు
జెందక, ధైర్యముం దాల్చి సంతోషవదనప్రదర్శనముం గావిం
చును. పిన్నపెద్దలతోడను స్వపరజనులతోడను సౌమ్యతతో
సాదరపూర్వకవచనము లాడును. ఇంటిలోవారితోడను బైట
వారితోడను ప్రేమ తొలుకాడ మాటాడును. పరులవ్యా
పారములలోనికిం దలఁదూర్పఁడు.

5. ఇఁక దుర్వృత్తమునకుం గారణములు కామక్రోధ
లోభములు మొదలగు దుర్గుణములు. వానిని జయించినవారు
వ్రేళ్లలెక్కిడఁగలయంతమందియే యున్నారు. నట్టిపదవులకై
పండితుఁడు, పామరుఁడుకూడ పైకము వెచ్చించి పేదయై బంధు
మిత్రులు పరులు ననుభేదంబులేక, యెల్లర మోసగించి నరకం
బునకు రాచబాట లేర్పరచుకొనుచున్న యీదినములలోఁ గోరి
కలు లేనివాఁడు క్రోధరహితుఁడు లోభశూన్యుఁడునై యొక్కఁ
డుండు ననుకొనుట వెఱ్ఱి. అట్టివారు విడివిడిగాఁగూడ నుండరు.
ఇట్టివాఁ డొక్కఁడున్నను బ్రజ లొకనిపై నొకఁడు నమ్మక ముం
చక, వారు శత్రువులై దేశసంక్షోభ ముదయింపఁజేతు రన్న

వింత యేమి? పేరాస పెక్కుడుమల కిల్లు. ఎవనికిఁ గావలసినంత ధనముమాత్రము వాఁడు నిలువఁ జేసికొనినచో, నధికమున కాశ పడనిచో దేశసంక్షోభము సర్వము నడుగంటును. ఈవాక్య మందముగ నున్నది. ఉపన్యాసవేదికపైనుండి గంభీరముగ గర్జించు వక్త కుపయోగముగ నున్నది. దీని నొరవడిబెట్టువాఁడే గాని నాచరణమునఁ బెట్టుయోగ్యుఁ డేడీ?

6. మానవునివృత్తము వానియాశయమును బట్టి యుండును. వర్తకునియాశయ మొకటి, న్యాయవాది యాశయ మింకొకటి, వీథి నూడ్చువాని యాశయము వేఱొక్కటి. మోసగించి, పేచీలుపెట్టి, శ్రమపడి ధన మార్జింప వారు తలంచెదరు. దేవునిదృష్టిలో నీమూఁడుపనుల నేది గణ్యతఁ గాంచునో యెల్ల రెఱింగినదే కాని నీమువ్వర నెవ్వని నీవు గౌరవించుచున్నావు? గౌరవ మీయవలసినవాని కీయక, గౌరవింపఁగూడని వానిని భీతిచేత గౌరవించుచున్నావు. వానివర్తనము చెడ్డ దని యెఱింగియు నొక్కని గౌరవించి, వర్తనము మంచిదని తెలిసియు నింకొక్కని గౌరవింపని నీవృత్తము నే మనవచ్చును?

7. సత్ప్రవర్తనమునకు లోకజ్ఞాన మావశ్యకము. నానాదేశాచారములు దెలిసి యాయా దేశమువారియెదుట వారి కనుగుణముగ మసలుట సద్వృత్తము. అట్లు మసలనిచో వారు నిన్ను దుష్ప్రవర్తనుఁడ వని సముద్ధతుఁడ వని త్రోసివేయుదురు. నీకును వారికిని సౌభ్రాత్రము కుదురదు. కలహము లంకురించును. దానికిం గారణము నీయజ్ఞానపూర్వకదుర్వృత్తము. రాజసభలోఁ బాదములు గన్పడఁ గూర్చుండుట

భారతీయులకుఁ దప్పు. హిందువులలోఁ జెప్పులతో భుజింపనేగుట దప్పిదము. తెల్లవారిలోఁ జేతివే్రళ్లతో సన్నము గలుపుట దుష్ప్రవర్తనాచిహ్నము. ఏసంఘములో నీ వుంటివో యెఱిఁగి నీ యంతరాత్మప్రబోధితములకుఁ బ్రతికూలములు కానట్టియు నీ వున్నసంఘమువారు హర్షించునట్టియుఁ బనుల నాగాముల నెంచి ప్రవర్తింపుము.

8. వాత్సల్యానువర్తనము లున్న వాఁడు తా నేమి చేసిన నితరుల కేమి హానిగలుగునో యని భయపడును. అమలప్రవర్తనముగల బాలుఁడు దేశమున కలంకారము. ఘనపరాక్రమసాహససంపన్నతగల స్త్రీపురుషు లెప్పుడును వినయవిభూషితులు. మర్యాద లెఱిఁగిన బాలురు బాలికలు సర్వదా యీ దిగువ వ్రాయఁబడిన వర్తనాసూత్రముల నాయాతావుల నెడంద నిడికొనందగుఁ గాన నవహితుండవై యాలించునది:—

స్వవిషయము:—స్వచ్ఛన్యాయవర్తనముం గలిగి యుండి, దుర్భావములాడక, దుస్సాంగత్యముఁ బరిత్యజించి శరీరము బట్టలు స్వచ్ఛముగ నుంచుకొనందగును. త్రికరణశుద్ధిగఁ దలపెట్టినపని చేయవలయు. పరమార్థజ్ఞునకు వినయఫణితి లగును.

స్వగృహము:—ఇంట జననీజనకులకు యథాశక్తిగఁ జేదోడు వాదోడుగనుండి వారిని సంతోషపఱచి గౌరవించి పూజింపఁ దగు. సోదరసోదరీమణులను దదితరబంధువులను

వాత్సల్యముతోఁ జూడఁదగును. స్వలాభపరుండవుగాక మంచి
వస్తువులన్నియు వారి కొసంగి మిగిలినవే నీవు పొందుట
యుచితము.

బడి:—నీవు విద్యార్థివైనచో నుపాధ్యాయుల గౌర
వించి, యణకువఁ గలిగియుండి వారియాజ్ఞానువర్తివైఁ బడి
విధానము లతిక్రమింపక మెలంగునది. దొంగతనము మొదల
గువానిపొంతఁ జనకుము. బడివస్తువులను నీస్వంతవస్తువులట్లు
భద్రముగఁ గాపాడునది. సత్యమును దప్పక న్యాయపథం
బుఁ బట్టుము.

ఆటలు:—ఆటలలో సంగడీండ్ర మోసగింపరాదు. బల
హీనుల బెదరింపఁజనదు. ఏమనఁగా నాపని పిఱికివారు చేయు
దురే కాని ధైర్యశాలు రొనర్పరు. అందఱితోడను సంతోష
ముతోఁ గలిసి మెలసి యుండుము. వారితోఁ బోరాడవలదు.
తోడివారి నేరిని వెక్కిరింపక వారికి హితవు లేని పేరులఁ బెట్టి
పిల్వక మెలంగునది. ఓటమికిఁ గుందకుము. నీవిజయమునకుఁ
గాక నీపక్షమువారివిజయమునకై యెల్లప్పుడు యత్నింపుము.

వీథి:—దారిని బోవుచో నుపాధ్యాయులుగాని యితర
పెద్దమనుష్యులుగాని యెదురైరేని వారి కంజలి ఘటించి వారి
యాశీస్సు లందఁదగును. వీథిని నడచువారిని గెంటి వారిమీఁ
దినుండియే నడచిపోరాదు. ఱాలుఱువ్వి యితరులకుఁగాని వారి
వస్తువాహనంబులకుఁగాని నష్టము గలిగింపఁజనదు. వర్తకుల
యంగడిగుమ్మములలోను, గిటికీలయొద్దను నిలిచి వారిని విసి

గింపఁజనదు. వృద్ధులతోడ నంగవిహీనులతోడఁ బరియాచకము లాడక, వారిని గ్రొత్తవారిని విశేషసౌమ్యతతో గౌరవింపుము. ఎదురగువారికిఁ జోటిచ్చుచు నెల్లవేళల వామపార్శ్వంబునకుం దప్పుకొని నడచునది.

సేవకులు:—సేవకులును బాటుపడువారినిగూడ నుచితగౌరవముతో నారయుందగును. నీవుద్యోగివై ధనమిాయఁగలవు. చెప్పులు గుట్టుకొనలేవు. చెప్పులఁ గుట్టువాఁడు పనితనము కలవాఁడు; కాని నిర్ధని. మిా రొకని కొకఁడు సాహాయ్య మొనర్చుకొనవలయును. ఎవనివ్యాపారములో వాఁడగ్రేసరుఁడే. ధనికుఁడ వని విఱ్ఱవీగక పనివారలను మధుర భాషణముల గౌరవింపవలెను గాని నిరసింపరాదు. నీవు ఘనుఁడవు కాదు; సేవకుఁడు నీచుఁడు కాఁడు. దైవదృష్టిలో నెల్ల రొక్కరూప. గరువముచే మానవులు స్థితిభేదములఁ బట్టి గౌరవభేదములఁ గల్పించి యొండొరుల నిరసించుకొనుట యనీతి. ఎల్లవృత్తులు నెల్లకార్యములు పరోపకారకములైనచో గౌరవనీయములే.

అన్నితావుల:—ఎచ్చటనైనను సరే పిన్నపెద్దలను నీమోటవృత్తముచే బాధింపఁజనదు. సంభాషణమం దయ్యా యమ్మా యను గౌరవపదముల దొఱలించుటలో నీ నాల్కను వెన్కాడనీయకుము. ఎవరిగృహమునకైన పోయిన వెంటనే యచ్చట పొంచుండి వినక, తలుపు మెల్లగఁ దట్టి నిలుచుండుము. ఎవ్వరని లోపలివా రడిగిన నే నని చెప్పక నీపేరు చెప్పుము.

పెద్దలు క్రొత్తవారు నీదగ్గరకు వచ్చినప్పుడు నీవే వారి కభి
ముఖుఁడవై గౌరవముతో స్వాగతం బిమ్ము. వారు గోరున
దిచ్చి యవసరమైనచో నీవు లేచియైనను వారిఁ గూర్చుండఁ
జేయుము. మాటాడువాని కెన్నఁ డడ్డు తగులకుము. అనవసర
వ్యాపారములలోఁ జేఁ జేసికొనకుము. వేళపట్టున నీపనులఁ
జేసికొనుము.

9. మొత్తముమీఁద దుర్బలుల రక్షించుట, యజ్ఞాను
లకు జ్ఞానబోధసేయుట, యెత్తుపడిపోయినవారికై జాలిపడి
వారిని లేవనెత్తుట, యధమస్థితిలోనివారికిఁ జేయూత నొసఁ
గుట, తల్లిదండ్రులఁ బ్రేమ ముట్టిపడ సేవించి వారిమాట
పాలించుట, బిడ్డలకు దయతో విద్యాబుద్ధులను గఱపి పెంచుట
మొదలగున వన్నియు మానవధర్మములు; సద్వృత్తలక్షణము
లు. ఎప్పుడు సేవచేయుటయే గాని భోగములపొందుట పని
గాదని యెంచుట, ననుదినము నిన్నటికంటె నధికతరస్థితిలోని
కరుదేరఁ బ్రియత్నించుట మేలు.

10. ఈగతినిఁ జెప్పఁబూనిన విఱుగుదఱుగు నుండదు.
ఆదియంతరము గానరాదు. ఏండ్లు పూండ్లు పట్టును. స్థాలీపులా
కన్యాయముగఁ జెప్పిన యీవర్తనాసూత్రములన్నియు వడఁ
బోసి కరడునఁబోసినసారంపుముద్ద యనంజెల్లు నొక్క వాక్య
మును సర్వదా స్మరింపుము. అది యేదనఁగా "నితరు లెట్లు
నీ కొనరింపఁగోరెదవో యట్లే నీ వితరుల కొనరింపుము." వారి
స్థితిలో నీ వున్నట్లూహించుకొని యప్పుడు నీ కేది హితమగునో
యెంచి యది యన్యుల కాచరించుటవలన నీవర్తనము బ్రశంస

నీయమైన దగును. ఇదియే వృత్తమును నవరించు మహాగురు మంత్రము. ఈ సూత్రంబులఁ బాడిగాఁ గొని యం దేర్పాటుగావించినమార్గంబున నడువ మేకొనువాఁడును, బరమేశ్వరునిపైన భక్తిఁ బాదుకొల్పినవాఁడును, దుర్నీతిసంఘవిధ్వంసనాపాదకుఁడునై యైహికాముష్మికసౌఖ్యంబు లొడఁగూర్చు పవిత్రనగల నరుం డగు ననుట తథ్యము.

---

## కోపము

కోపమునను ఘనత కొంచెమై పోవును
గోపమునను మిగుల గోడుఁ జెందుఁ
గోప మడఁచె నేని కోరిక లీడేరు.—(వేమన)

1. అపరాధులపైఁ గొందఱిమనంబులఁ బ్రజ్వలితం బగు తీక్ష్ణవృత్తి కోపము. కోపము కాపురుషగుణం బని భారత వచనము; బుధాభిప్రాయము; విశ్వసనీయవిషయము. కోపము దేశికగుణములం దొకటి.

2. ప్రపంచమునఁ గోప మెఱుఁగనిజాతి లేదు. దారిద్ర్యముచే భోగమున కెడమైన జాతు లున్నవి; సంచారజీవనమున కలవడి స్థిరవసతిసౌఖ్య మెఱుఁగని జాతు లున్నవి; సోమరితన మన్నది శూన్యముకా నిరంతరపరిశ్రమఁ జెందుజాతు లున్నవి; కాని కోపోద్రేకముం జవిఁజూడని జాతిమాత్రము నిప్పచ్చు. దేవతలు కూడ నప్పుడప్పుడు కోపము వహించినట్లు గాథ లుండ మానవులు జంతువులు గోపమూనుటలో నబ్బుర మేమున్నది?

3. ఇకఁ దక్కుంగల యుద్రేకగుణములకును గోపము నకును భేదము లొకటి రెండున్నవి. తక్కినగుణములు కేవలము వ్యక్తిగతములు. ప్రేమం గనుఁడు. సామాన్యముగా నొకపురుషుఁ డొక స్త్రీని మోహించును. ఒకజాతిలోని లేక సంఘములోని పురుషులందఱుం గలిసి గూఁపని చేయరు కాని, జాతి మొత్తమంతయుం గలిసి యేకాభిప్రాయమున నితర దేశములపైననో, పరరాజులమీఁదనో కోపమూనుట యున్నది. మహాసైన్యములు కోపప్రేరితములై రణంబు లొనరించిన సందర్భము లేదేశచారిత్రమునందైన గుప్పలు తెప్పలుగఁ గన్పట్టును. ఉద్భవించినప్పుడే కోపము తా రాజువ్వవలె పైకెగయును. తక్కుంగల గుణము లుత్పన్నములైఁ క్రమముగఁ బెఱుంగును. కోపోద్రేకపరవశత్వంబునఁ దనకుఁ గాని యెదుటివానికిఁగాని రాఁగల కీడు తెలివిడి కోపికి లోబరంబగునను ట నిజంబు. ఆలోచించి పునః ఆలోచించి కోపి యేపనియుఁ జేయఁజాలఁడు. ఉద్రేక మాతని ముక్కుపట్టిలాగ నున్మాదము జెంది యాతఁడు కొట్టుకొనిపోవును. తన బలాబలములగాని, భాగ్యాభాగ్యములఁ గాని విమర్శింపక కోపి కోపకారకునిపైఁ బగదీర్చుకొనుపని నితరులకుం జెప్పక 'యహ మస్మి' యని తానే బయలుదేరును. ఇంతియఁ గాక ప్రౌఢమైన కోపమును గోపి దోషమొనరించినవానిమీఁద తీర్చుకొనసాధ్యము కాని యెడల నితరులమీఁదనైనఁ దీర్చుకొనును. భర్తపై నలిగిన భార్య చంకబిడ్డను జావఁగొట్టును. పైయధికారిపై నాగ్రహావేశుఁడైన యుద్యోగి క్రిందినౌకరులఁ బడఁదిట్టును.

4. అనాథకహంకార మెక్కుఁడనునార్యోక్తియున్నది. రోగులకుఁ గోపము ముక్కున నుండును. కొంద ఱకారణ ముగఁ గోపమూనెదరు. శాంతమూర్తులకుం దగినంత కారణ మున్నప్పు డెప్పుడో నూటికిఁ గోటి కొక్కసారి కోపము గల్గును. కుపితులు కొంద ఱొకప్పుడు మండిపడియుఁ దదుత్తర క్షణమున శాంతస్వాంతు లగుదురు; కోపహేతువే మఱచెదరు. ఇతరవ్యాపారములు లేని కొందఱు కోపకారణమును దీర్ఘకాలము స్మరించుకొనుచుఁ గోపమును విషసర్పము నట్లు పెంచుచుందురు. కొందఱు కపటులు పైకి నవ్వుచున్న మోములఁ బ్రదర్శింపుచుండియుఁ గోపము నంతర్వాహినిగఁ బ్రవహింపఁజేయు చుండెదరు. ఇంకఁ గొందఱు కోపకారకుల నేమియుఁ జేయంజాలక వారియనంతరము వారిసంతతివారిపైఁ గూడఁ గోపమే వహించియుందురు. ఎట్లయినను గుపితుఁడు ప్రశంసనీయుఁడు కాఁడు. కుపితుని వ్రతము జపము తపము దానము మొదలగునవన్నిటి సంతకుఁ డలుకతో నపగతము గాఁగఁ జేయు నని ప్రమాణవచన మున్నది.

5. బలవంతుఁడు కోపముఁబూనినయెడల వెంటనే దానిని మానఁగలశక్తిమంతుఁడై యుండవలెను. అనఁగాఁ గోపగ్రహణమునకు విడుపుకూడ నుండవలయును. విడుపుశక్తి లేనిచోఁ గోపము కోపికి స్వనాశకరము. నిదానముగల్గి సంతోషస్వాంతుఁడగువానికిఁ గోపముగల్గిన వాడకట్టంతయు జాగ్రతగ నుండితీరవలసిదే! ఏ మనఁగా వాఁడప్పుడు బుద్ధిఁగోల్పోయి కర్ణధారుఁడు లేని యానపాత్రమువలెఁ దేలిపోవును. ఘనులలోఁ

జాలమంది కోపముఁ జెందెడివార లే యనవచ్చును. అందుచేతఁ గోపము బుజువర్తనచిహ్న మని కాని ఘనతాలక్షణ మని కాని యనఁగలమా? ముక్కునఁ గోప మున్న దూర్వాసు లెంద రో మనలఁ బరివేష్టించి యున్నారు. వారందఱు గొప్పవార లేనా? అయితే కోపభేదములందు సత్యాగ్రహ ముత్తమోత్త మమని మహాత్మగాంధి యభిప్రాయ పడుచున్నాఁడు. తది తరకోపభేదంబులన్నియు నల్పతాచిహ్నంబులే.

6. కోపాటోపసామజంబు మానససరఃకోలాహలో త్సాహియై విహరించువేళ దుర్వారకోపవివశుని యాకృతి యెట్లు భయంకరముగ నుండునో యెఱుంగుదువా? బహుతీవ్ర ములగు దృక్కులు, వేడియెక్కి జేవురించి గీసినకందదుంపవన్నె వదనము, నిల్కడలేక యిటు నటు చలించి చలించి కడకు ఱెప్పవాల్పక చిత్తరువువలెఁ జూచు నేత్రములు, ముడివడ్డ కనుబొమలు, పటపటలాడు పండ్లు, బిగించిన పిడికిళ్లు, సంచ లించెడి పెదవులు, నసంగతమగు నపస్మారపు కేకలు, బెద రింపులు, శాపములు, నెగిరిపడు నాశికాపుటములు, సర్పము వలె బుసకొట్టు వేడినిట్టూర్పులు, సంచలించెడి యవయవం బులు చూపఱ భీతిఁ గొల్పును. ఎదుటివాఁడు కన్నెత్తి యివన్ని యుం జూడనేరఁడు. ఇట్టివికృతాకారము కోపసంభవమే కాని ప్రజాపతిసృష్టి కాదు. కుపితుఁ డెల్లప్పుడు కోపము శాం తించువరకు ముండ్లపై నుండును. పరులు వాని నప్పుడు కదు పుట కందిరీగల తుట్టెం గదుపుటయే.

7. కోపము కూడనిగుణ మని తేలినది కనుక కోపముఁ జెందకుండుట కుపాయము లేవి? కోప మూనకుండుటకుఁ గోపావిష్టుని వికృతాకృతిని మతిభ్రమణమును గోపము వలనఁ గలుగునష్టములను స్మరించు టొకవిధము. కోప మధమదుర్గుణము. అది నష్టదాయకము. ఆత్మహత్యాకారణమే గాక బలవన్మరణహేతువు. తండ్రికిఁ బుత్రశోకమును, భార్యకు భర్త యెడబాటును, నధికారికి సేవకునిపై నసహ్యమును, వ్యాపారస్థునకు నష్టమును గలిగించునది యాగ్రహము. ధన మున్నవాఁ డది యనుభవించి మురిసియుఁ, గోప మున్నవాఁడు పరుల బాధించి మురిసియును. కోప మసూయకన్న పాడుగుణము. ఏమన నితరులసౌఖ్యము చెడవలెనని కోరున దసూయ. పరులసౌఖ్యమును జెఱుచునది కోపము. ప్రపంచమునందలి యుద్ధములకు, వైరములకు, దూషణములకు, దుర్మార్గములకు హేతువు కోపము. కోపమునకుఁ గారణము తగని యహంభావము. నరుఁడు తాను గొప్పవాఁడ ననుకొని నీచమగు కోపమున కగ్గ మగును. కోపముయొక్క యీ యవలక్షణములన్నియుఁ దలపోసికొనినచోఁ గోపము మాన్పుకొనుటకు సుఖోక్కపద్ధతి దొఱకును. ఇతరులు తనను దూషించి రని దానఁ దనఘనతకు లోపము వాటిల్లె నని యూహించు నరుఁడు నిజముగ ఘనుఁడు కాఁడు; నీచుఁడే. నరుఁ డెంత ఘనతగలవాఁడైన నంతగా నితరులదూషణభూషణంబులచేఁ జెక్కుచెదరక నిల్వఁదగు. ఎట్టి యపకారమును నీకుఁ గోపము గలిగింప దనుటకంటె నీ ఘనత కుచిత

మగు బసదనం బెద్ది? బహుళవ్యాపారము లున్నవాఁ డెద్దానిలో
నైన నష్టపడి విచారము చెందును. స్వల్పమైన కారణమే
యాతనికిఁ గోపము పుట్టించును. అందుచే నందనిమ్రానిపండ్ల
కఱ్ఱులు సాచి విఫలప్రయత్నజనితమనఃక్షోభమును వినాశ
కరమగు కోపభరమును దెచ్చిపెట్టుకొనఁగూడదు. తలకు
మించిన పనులలో వ్రేలిడరాదు. ఎప్పుడును శాంతచిత్తులతోఁ
గోపము లేనివారితో మెలఁగుట మంచిది. ఇది కోపము రాకుండఁ
జేసికొనుమార్గములలో నొక్కటియా యని సందేహింపవల
సిన పని లేదు. ఏమన వన్యఘాతుకమృగములును మానవపరి
చయమున్న సాధుసత్వము లగుచుండఁగా, ధూర్తకోపస్వభా
వులగు నరులు సజ్జనసహవాసంబువలన సాధువర్తను లగుట
లో వింత యేమి? కోపము గలిగించెడివారి యెదుటఁ బడక
పోవుట మేలు. కొంతమందికిఁ దా మగునన్నది కాదన్న వేళఁ
గోపము వచ్చును. వారిముందు ముక్కు గోకుకొన భయము.
ఎంతైనను గోపముపుట్టించు వాగ్వాద మాదినే గోటఁ ద్రుంచి
వేయఁదగును. గ్రంథపఠనము కోపమున నవకాశ మీయదు.
ఆకలిఁగొన్నవాఁడు, విసిగివిసిగి వచ్చినవాఁడు, చిత్తవ్యాకులత
జెందినవాఁడు గాలితోఁ గలహింప సంసిద్ధులై యుందురు.
వారి నిజబాధఁ బాపనిఁకఁ గోప మంకురింపదు. ఇంతవరకుఁ
గోపము రాకుండఁ జేసికొను పద్ధతులు పేర్కొనఁబడినవి.

8. కోపము శత్రు వగుట నది పొడమకుండఁ జేసెడి
మార్గములతరువాతఁ గోపము నడంచు నుపాయము లారయం దగును. కోపము పొడసూపు లక్షణములు తోఁచి

నంతనే వాని నడంచుటకై యత్నింపుము. కొందఱురోగు
లకు రోగమువచ్చు పూర్వమది సంభవించులక్షణములు తెలి
యవచ్చునట్లే యమితకోపుల కది కలుగక పూర్వమే తదా
గమనచిహ్నము లుదయించును. అందఱకొకటే కోపకార
ణ ముండమి నొకఁడు తిట్లకు, నొకఁడు దుష్టచేష్టలకుఁ గిని
యును. ఒకఁడు నిజవంశగౌరవము పవిత్రముగాఁ దలం
చును. మఱొకఁడు స్వవిషయమే ప్రధానముగ గణించును.
దానినిదిట్టుట వానికిఁ గోపము పుట్టించుటే. 'ఉన్నమాట
యన్న నులు కెక్కువ' యండ్రు. కాఁబట్టి నీ కోపకా
రణ మేదో నీవు తెలిసికొని దాని నితరులకుఁ దెలియనీయ
కుము. ప్రతివిషయమై తెలియఁ బ్రయత్నింపకుము. నీకుఁ
గోపముగలిగించు పరులదూషణములు నీవు తెలిసికొను
ప్రయత్నములమూలముననే నీ కెఱుకపడి తీరనివిచారమును
గలిగించును. నీ వూరకున్నచో నది సమసిపోవును. పరుల
దూషణములవిషయమై నీ యజ్ఞానమునకంటె నీకు హిత
మొడఁగూర్చునది యితరం బుండదు. అనేకులు కోపకారణ
ములను దామే కల్పించుకొందురు. ఎప్పుడును గోపము
మానవుని జేరదు. మానవుఁడే కోపముం బూనును. కోప
మెదురుపడినను దానివైపుఁ జూడరా దన్నప్పు డద్దాని
నాహ్వానించి తెచ్చిపెట్టుకొనుటకంటె నకార్యముండునే? కర్త
యూహఁ దెలిసికొనక కార్యము కంటఁబడినంతనే నీవు కిని
యుట నైజము. అట్టియెడ క్షమకంటెఁ గోపగజమున కంకు
శము మఱొండు కానరాదు. కోపము వెడలఁగ్రక్కక పాలు

మూలినయెడలఁ గాలమే కోపమును రూపుమాపును. క్షమ యు నాలశ్యమును గోపవినాశకరములు. కోపమువచ్చినప్పుడు బుద్ధికిఁ దోఁచినదంతయుం జేయుటకు మున్ముందుగా దీర్ఘశ్వాసముఁ దీసికొని తదుపరి పదిసారులు భగవన్నామస్మరణము జేయుట కర్తవ్యము. కోపముగలయంతసేపు నీ వేఁకార్యముం జేయను నమకట్టరాదు. కోపమును బైకిఁ బోకనూప నీయకుము. కోపమును జయింప నీయావచ్ఛక్తి నుపయోగింపుము. ఒకవేళ నీవు దాని జయింప లేకపోయినను నష్టములేదు కాని కోపమునుమాత్రము నీపై నెన్నఁడును విజయమంద నీయకుము. "సీ॥ పరులదోషంబునఁ బ్రభవించు క్రోధ, ముక్షీణక్షమాయుక్తిఁ జేసి పొలియు"నను భారతవచనము నిక్కమగుటఁ గోపమును క్షమచే నుపసంహరింపఁదగును.

9. కోపము నగ్నితోఁ బోల్చుట కలదు. కోప మగ్నివంటిది. కోపాగ్ని యితరులఁ గాల్చుటే కాదు, తా నంటిన కట్టెను గూడ దహించును. సరిగా వినియోగించువాని కగ్నివంటి యుపయోగకరవస్తు వింకొకటి లేదు. సరిగా నుపయోగించుకొనలేనివాని కగ్నివంటి వినాశనహేతు వేదియు లేదు. కోపము నట్టిదియే. కోపము ప్రధానముఁ జేసికొని ధనము, స్నేహము, బంధుత్వము, రాజ్యము, కడకుఁ బ్రాణమునుగూడఁ గోల్పోయి, చేతులు కాలినపిదప నాకులఁ బట్టుకొన్నట్లు పశ్చాత్తాపముఁ జెందినవారలున్నారు. వారిచరిత్రలఁ దలంచి కోప మూనకుండుట నీకు ముఖ్యకర్తవ్యము.

10. తాటాకుమంటవలె నొక్కసారి లేచు కోపము వెంటనే చల్లారును. లోలోపల నణగి పెంపొందు కోపమెక్కుడపకార మొనరించును. దీర్ఘకోపము ప్రాజ్ఞలక్షణము కాదు. మొత్తముమీఁదఁ గోపము కూడని తామసగుణము.



## ఎగతాళి.

1. ఎగతాళిసేయుటయనఁగాఁ బరిహసించుటగదా యని యెల్లరు బరిహాసము చేయఁబడుట కర్హు లనుకొనఁగూడదు. దైవ ప్రసక్తిలోఁ బరిహాసమున కాస్పదము లేదు. "నావిష్ణుః పృథ్వీపతి" యనుటచే ధరాపాలురు దేవసములు. తల్లిదండ్రులు, నక్కసెల్లెండ్రు, నన్నదమ్ములు, గురువులు, వయసుచెల్లిన వారు, పరస్త్రీలు పూజనీయులగుట నెన్నఁడెగతాళి కనర్హులు. నృపాలు రొండొరులతోఁ బరిహసించుకొనెదరు. బావ మఱఁది మఱదలు జామాత మనుమఁడు మనుమరాలు మొదలగువారలు నావరుసలుగలవారు ప్రేమపూర్వకముగ గేలికిందగిన జనము. ఎవ్వరితోనైన నపాయకరమగు పరిహాసముత్సాహశూన్యతను బాపు దివ్యౌషధము. కాఁబట్టి యన మితమై యుచితమై సమయానుకూలమై సందర్భానుసారమగు గేలి యక్రమముగాదు; పైగా నవసరము.

2. పరిహాసముచేయుట మేలైనదేకాని యదే వృత్తిగాఁ బెట్టుకొనుట దోషము. సమయమువచ్చినపుడు పరిహసింపఁదగునేకాని పరిహాసముచేయు సమయములఁ గల్పించుకొన

రాదు. వృత్తిగాఁ బెట్టుకొని యితరులం గేలిసేయువాని నేరును మెచ్చరు. దరిఁ జేరనీయరు. ఎప్పుడైన మనోల్లాసము నకుం జేట్లాడిన కావనరుకాని యదేవృత్తిఁ జేసికొనుట నీతి పరులనిందల కర్హమై పరులకు దూర మగుటయే. అదేరీతి నజస్రము పరిహాసముసేయుటే ముఖ్యవృత్తిగాఁ బెట్టుకొనిన వాఁడు మెప్పు వడయుంజాలఁడు.

3. ఇరువైపుల వాయిగల యాయుధంబులంబోలు వేదవాక్యంబులవిషయంబునఁ బరిహాసమొనర్చుట యగ్నినిఁ గట్టుకొంగున మూటగట్టుకొనుటయే. వేళాకోళమున కుచిత ములుగ దేవుఁడు, దేవాలయము, వేదములు, మొదలగువాని కంటె మించినవేవియు నీకుఁగన్పట్టుటలేదా? పరియాచకము చేయువిద్య సులభముగాఁ దలపెట్టినంతనే మానవున కబ్బును. నీచపరియాచకము బిల్వ నక్కఱలేకయే పట్టువడును. దానిఁ గొనితెచ్చుకొన నక్కఱలేదు. తనకొడుకును గృహ వ్యాపారములఁ బెద్దను జేయుదునను నర్థముతో నాకొడుకను యువరాజును బట్టాభిషిక్తుఁ గావించెద ననియొక పేదవాఁడనెను. ధర్మాధర్మవిచారణచేయుచు న్యాయపూర్తిమై శాంతిమంతుఁ డై యుండవలసిన నృపాలుఁడాపలుకు లాలకించి తనకుమారు నాపేదవాఁడెగతాళిఁ జేసెనని యాగ్రహంబుం బూని వాని తలఁ దీయించెను. కష్టసమయములందుసయితము శాంతస్వాం తుండై యుండవలసిన భూనేతకే యింత తొందరపాటును బుట్టిం చినపరిహాసవాక్యము పరులవిషయమునఁ జేయు చిత్త విభ్రమమును జెప్పనలవియే? ఏమాటలనందునైన నీ వను

కొనకయే నృపాలురను దైవమును బూజ్యులను వేదములను గేలిఁగొట్టితివా వెంటనే పశ్చాత్తాప మూనవలసియున్నది. బుద్ధిపూర్వకముగఁ బాకముదప్పి చేయు నిరసనాపూర్వకపరిహాసవాక్యములు మూర్ఖులయనుగ్రహము సంపాదించినను బుద్ధిమంతుల కాగ్రహకారణములే యగును. నాగరకతలో నగ్రస్థాన మలంకరించియున్నాముగదా యని సంభాషణమున వాక్యస్వారస్యము లేని మోటుయాటవికులవలె మెలంగుట యేరికిం బాడిగాదు. అధికారము చేతిలోనున్నదిగదా యని సేవకులతోడను, ధర్మమిచ్చువాఁడనుగదా యని బిచ్చగాండ్రతోడను బరియాచకమునకు దిగుట పనికిమాలిన కార్యము.

4. మరణమొందినవారివిషయములో నెన్నండుం బరిహాసము విసర్జింపందగును. చనిపోయినవారిచెడుగులన్నియు మఱచిపోయి మఱి స్మరియింపకుండుటే ప్రాజ్ఞులకు ధర్మము. సరివారితోఁ బరిహాసముచేయుటొకటి, విగతజీవులవిషయమై పరిహాసపూర్వకముగ వాకొనుట వేఱొకటి. ఎంతనీచుఁడైనను బరమపదించిన పిమ్మట వానిమంచితనప్రశంసనే నీవు తలపెట్టుము. మృతులను నీవు పరిహాసించినచో నీవుమాత్రము నీమరణానంతరము భావిసంతతులగేలికిఁ బాత్రుఁడవు కావా?

5. బాగుపఱచుకొనలేని సహజలోపము లితరులయందున్నచో నీ వెప్పుడు వారి నావిషయమున గేలిసేయఁ బూనరాదు. కుంటివానిని వాని చేతికఱ్ఱతోడనే కొట్టుట తగదు. లోపముల నెంచి పరిహాస మొనర్చునపుడు దైవదత్తములగుట నట్టి లోపములను నీ వెత్తుకొని పరిహసింపరాదు. న్యాయము

నీతి వీడక నరుఁడు జీవించుచున్నచో వాఁ డేవృత్తి నవలంబించి
నను నెగతాళి కర్హము కానేరఁడు. పేదవృత్తియైనను శ్రమ
కాలవాలముగువృత్తియైనను సరే యోగ్యమైనదే! ఆవృత్తి
నంతమాత్రమున నపహసించుట తగదు. చెప్పులఁ గుట్టువాని
వ్రేళ్లు నల్లగా నున్నవనిగాని యుమ్ముఁ ద్రొక్కువాని కాళ్లు
బాడెగా నున్నవనిగాని నవ్వి పరిహసించుట నీచమైనపని.

6. నరుఁడు పరుల దుష్టపరిహాసవాక్యతత్పరుఁడై
యుత్సాహపూర్వకంబుగ వాని నేకరువు బెట్టినపు డవి స్వకీయ
ము లట్లు పలుకాడుట సాజము. అట్టితఱిఁ బరవాక్యగర్భితవిష
పుఁగొండిని దొల్తనే తొలఁగించి చెప్పవలయును. చమత్కా
రము లేక యున్నదంతయు నెత్తిపొడుపేయైన పరిహాస మక్కఱ
కురానిది. నిందయే యందుఁ బ్రాధాన్యత వహించిన యెడల
నది సర్వావయవవిషపూరితఖలపరిహాస మగును. కావున
నట్టిదానితో జోక్యముగలుగఁ జేసికొనక మిన్నకుండుటే యు
త్తమపద్ధతి.

7. ఒక్క యెగతాళివాక్యమువలన స్నేహితులఁ
గోల్పోవుటకంటె మరణమే మేలు. కారము నోటికిఁ దగిలి
నప్పుడే మిర్చిరుచి తెలియుననునది మనస్సులో నిడుకొని
కొందఱితరుల నొవ్వఁ బల్కినప్పుడే కాని తమపరిహాసము
నకు విలువ లేదని యెంచెదరు. పరులమనస్సుల నొచ్చు మచ్చున
మాటలాడెదరు. ఎగతాళి జనసామాన్యమువిషయమైనచో
బాధ లేదుగాని విశేషించి ప్రత్యేకవ్యక్తులఁగూర్చి యైనచో
బాధకరము ; స్వఘనతకు భంజకము.

8. ఇతరులపరిహాసము నీకుఁ గోపహేతు వగునప్పు డీవెన్నఁ డితరులను బరిహాసింపఁజనదు. ఇచ్చి పుచ్చుకొనుట యనఁగా నని యనిపించుకొనుట పరిహాసతత్త్వరహస్యము. కాచగృహవాసివైన నీ వితరులగృహంబులపై ఱాలు రువ్వ రాదు. ప్రతిక్రియ ననుభవింపఁగల శక్తిమంతుఁడవై నప్పుడే యాక్రియ నాచరింపవలెను. పడఁగల యతఁడే మాట లనవల యును. మాటపడువాఁ డుండఁడుగదా! కనుక ప్రతిపరిహాస ము పడఁగల్గిననే పరిహాస మాడఁదగును. అన్యుల నెగతాళి కుడికెడువానిని లోకులు మఱింత యెగతాళి సేయుదురు. ఎగ తాళిసేయువాఁడు తాత్కాలికానందముచేతఁ బొంగిపోయి గురివెందగింజచందమునఁ దననలు పెఱుఁగక యన్యుల నెఱసు లన్వేషించి వానిం బరిహాసించుచుండును.

9. పరిహాసమున కొక సమయ మన్న దున్నది. ఎల్ల వేళలఁ బరిహాసము సేయువాఁడు కాలౌచిత్యముం గనిపెట్టమిని చిక్కులం దగుల్కొనును. విచారసంతప్తుఁ డగువానితో నెక్క సక్కెములు కూడదు. ఒకఁ డాలోచనలో నున్నప్పుడు, బంధు గులతోఁ గూడియున్నప్పుడు, దుఃఖములోఁబడియున్న వేళల, నీవు వాని నెగతాళియొనర్పఁగూడదు. తన కురిశిక్షపడి తల తీయఁబడుటకుముం దెవ్వఁడు పరిహాసములఁ బాల్గొనఁడు. ఏమన విచారసమయమునకుఁ బరిహాసమునకుఁ జుక్కయెదురు. భక్తి, ప్రేమ, దుఃఖము మొదలగునవి పరిహాస మొనర్ప రానివి; చులకన చేయరానివి.

10. ఈవిధముగఁ బరిహాసనియమ నవరత్నహార మిందుఁ బొత్తుపఱుపఁబడినవి. పరిహాసవాక్యములు చమత్కారముగను సమయానుకూలముగను వర్తించినచో దురుద్దేశప్రోత్సాహితములు కానివగుచో సంభాషణమునకు వన్నెఁ దెచ్చును. పలుల దూఱుటకును, దనపై నుస్ప దెచ్చుకొనుటకును నుపయోగపడు పరియాచక మనవసరము, అప్రశస్తము. విచారసమయములందుగాక సంతోషసమయములందుఁ బ్రేమపూర్వకమగు సమయానుకూల పరియాచకము జలయూరిన ట్లూరుట సహజము, దుఃఖవినాశకరము, సంతోషసంవర్ధనము.



## వృత్తి.

1. పలువృత్తులు నుదరపోషణార్థమే యనునర్థమిచ్చు 'నుదరపోషణార్థం బహుకృతవేషం' అను సామెతగలదు. అనఁగా మానవు లాహారార్థము వివిధకార్యము లాచరింపవలసి యున్నది. జీవనోపాధికొఱకు నరుం డవలంబించి చేయుపనినే వృత్తి యందురు. చెప్పులుగుట్టుటవృత్తి. వ్యవసాయము చేయుట వృత్తి. ఇట్లే వర్తకము, వడ్రంగము, కమ్మరము మొదలైన వన్నియు వృత్తులు. ఏయింట వంశపారంపర్యముగా వృత్తి యొక్కటియే యవలంబింపఁబడినదో యది యాయింటి కులవృత్తి యగును. నేఁ డుద్యోగము చేయుట వృత్తి, దాస్యమొనర్చుట వృత్తి, తిని కూర్చుండుట వృత్తి, తల కొకవృత్తి. దినమున కొకవృత్తి. తండ్రియుద్యోగి కాఁ గొడుకు సాపాటురామన్న

వృత్తి జేకొనవచ్చును. నేఁడు ధనమునకై యన్నవిక్రయశాల
స్థాపించి నడిపి యెల్లి గౌరవోద్యోగియై వెలయవచ్చును. కొంత
కాల ముదరపోషణార్థము క్రమముగాఁ జేయుకార్యము వృత్తి
యనందగును. ఊడిగపువృత్తులకంటె స్వతంత్రవృత్తులు
మేలైనవి. కులవృత్తి యవశ్య మవలంబనీయము.

2. ఏవృత్తియైన నవలంబించి చేయువారంద ఱొక్క
నామంబున వ్యవహరింపబడుదురు. కంసాలులు, బజంత్రీలు,
మేదరులు మొదలగు పదము లన్నియు నీరీతి నుద్భవించిన
నామంబులే. వృత్తి యేదైన నేమిగాని దాని నవలంబించినవారు
శ్రమపడి పరోపకారములైన పనులఁ జేసి తన్మూలమున ద్రవ్య
మార్జింప సమకట్టుట సమంజసము. అట్లార్జించినసొమ్ము తినిన
వానికరుగుదలకువచ్చును. శ్రమ లేకగడించినది దక్కదు. మోస
గించినదానిమాట చెప్పనేల? అట్టిది యేదోవిధంబున నాశనం
బగును. సంవత్సరంబంతయుఁ జెమ్మట యోడ్చి శ్రమపడిపొలము
లోఁబనిచేసి పండించిన పంట నమ్మియో తినియో తృప్తి
జెందువానిది యోగ్యమైన వృత్తి. బలవంతుఁడై శ్రమ
నొల్లక బిచ్చగానివృత్తిఁ బూని ప్రజల వేపించుకొని తినుట
శ్లాఘనీయమైన వృత్తి గాదు.

3. అవలంబించినవృత్తియందులక్ష్యముంచిన్యాయబుద్ధి
తోఁ గొనసాగించుచో నరుఁడు కీర్తిమంతుఁడై వృత్తిఘనత
కాపాడినవా డగును. అన్యాయప్రవర్తకుఁడైనచోఁ బేరుఁ
బోఁగొట్టుకొని వృత్తివారి కందఱకు నపఖ్యాతి చేకూర్చును.
నాటకములాడుట వృత్తిగాఁ బెట్టుకొనిన నటకుఁడు వృత్తియం

దలి మంచినంతయు నేర్చి ప్రజలరంజింపఁజేసెనా పేరుగాంచును. త్రాగుడు మొదలగు పాతకంబుల కొడిగట్టెనా ప్రజల రంజించియుఁ ద్రాగుఁబో తనిపించుకొనును. అంతటితోఁ గథ ముగిసిన మేలు. కాని నటకులకందఱకు నదే పేరు లోకమున వాడుకలోనికి వచ్చును. నటకులు కొందఱు సారాయములకుఁ, గొందఱు స్త్రీలకు లోనగుటచేత నేకదా కళ్యమై, పండితాకర్ణనీయమై, గౌరవాస్పదమై వెలయవలసిన నాటకవృత్తి నేఁడు నీచవృత్తిగఁ బరిగణింపఁబడుచున్నది. సంగీతము లని కూనిరాగములు తీయుచుఁ జదువుపొంతఁ బోని కుమారునిఁ గని, తండ్రి 'నాటకపు...'యని సంబోధించి తిట్టుచున్నాఁడు. కొందఱుద్యోగులు తో(ల)చముల గ్రహించుటచేతఁ గొన్నియుద్యోగములు లంచపు టుద్యోగము లని పేరు గన్నవి. కాఁబట్టి యెవ్వఁడైన తన వృత్తియందు లక్ష్య ముంచి గౌరవ మార్జింపవలెను.

4. ఏవృత్తివాఁడైనఁ దనపరికరములఁ బూజింపవలెను. వ్రాయసకాఁడు లేఖనిని, కమ్మరి సుత్తెలను, మేదరవాఁడు కత్తులను బూజింపవలయును. నావికులు మనదేశములో జెప్పులకాళ్ళతోఁ బడవ నెక్కనీయకపోవుట తెలియునా? ఏ పరికరములు తన జీవనమునకు మూలమో, తనవృత్తికి చిహ్నములో వాని నావృత్తివాఁడే పూజింపకున్న నితరులు గౌరవించెదరా?

5. వృత్తి కొక్కనియమముండి వృత్తివారంద ఱానియమంబులఁ బాటించి మెలఁగుట క్షేమము. వర్తకులందఱు నేయి నొక్కధర కేవిక్రయింపవలెను. లాభము రూపాయి కణాయుండ

వలెను; తప్పుడురా ళ్లుపయోగింపరా దని నిశ్చయించి యా సూత్రముల నేమఱక గమనించినచో వర్తకము ప్రశంసనీయ వృత్తియగుటయే గాక వర్తకులు న్యాయపథానువర్తులని పేరు గాంచెదరు. నియమములు లేక యున్నను వానిఁ బాటింపక వణిక్కులున్నచో వర్తకుల నమ్మువా రుండరు. వారికిఁ జెడ్డపేరు వచ్చి స్థిరముగ నిల్చిపోవును. మోసగాండ్రనియు ద్రవ్యసంపాదనమునకే మార్గమైనఁ ద్రొక్కెదరనియు వారిని జనులు వర్ణించుటయే గాక యావర్ణనల కింక నెన్నియో చిలవలు పలవలు మొలిపించెదరు. న్యాయవాదివృత్తిలో నున్న కొందఱు కక్షిదారులకు వైరంబు పెంచి మోసగించి ద్రవ్యములాగ సమకట్టి రనుఁడు. అప్పుడు న్యాయవాదులు పేచీకోరు లను బిరుదు లనాకాంక్షితముగ లభియించును. తప్పు జేసినవారికే కాక తద్వృత్తివారి కెల్లర కదే నామము సిద్ధించును. కొందఱ దుష్ప్రవర్తనమువలన వారిగౌరవమే గాక వృత్తిగౌరవముకూడ నేలమట్టమై సంపూర్ణముగా నదృశ్యమగును. మఱియు నెంత పాడువృత్తి యని పేరుగన్న దానియందుఁ గొలఁదిమంది యోగ్యులు పాపభీతిగలవారు దైవభక్తిగలవారు నుందు రనుట తథ్యము. కాని వారుకూడ శేషించిన దుర్మార్గుల దౌష్ట్యము వలన వెల్లడికాక యణఁగి మణఁగియుందురు.

6. వృత్తిలోనివారినందరి నియమబద్ధులఁ జేయుటకు ప్రతివృత్తి కొక్కసంఘ మావశ్యకము. ఇందున కక్షరజ్ఞానము న్నవారు ప్రతివృత్తిలోఁ గావలెను. చదువులోఁ బుష్కరము పై గడపి పట్టభద్రులై యుద్యోగములకై తిరిగి తిరిగి తక్కువ

కమ్మఁడువోవుటకంటె విద్యాధికులేవృత్తినో చేపట్టి కొన్ని నిబంధనలప్రకారము సంచరించి స్వతంత్రజీవనములఁ జేయుట మేలు; వృత్తిసంఘము నెలకొల్పి వృత్తిని లేవనెత్తుట కర్తవ్యము. వృత్తు లగౌరవప్రదము లని కొందఱుస్త్రీలు పరులకు బందుగులకే యనుడు బానిసలైరి. ఇంట స్త్రీలు చేయఁదగినపను లెన్ని లేవు? విద్యావంతులు కూడ నభిమానపడక వృత్తు లవలంబింపవలయు. ఇప్పటి యున్నతవిద్య యుద్యోగలోపము, నిరాశ గన నింతకంటె నుత్తమోద్యమము కానరాదు. ఉద్యోగియై ధనము తక్కువ కమ్మఁడువడి యొకనిక్రింద నూడిగముచేసి బ్రతుకుటకంటె స్వతంత్రవృత్తి నేర్చి యొక్కచో దుకాణము పెట్టి, పదుగుర నాకర్షించుట శ్రేష్ఠతరముగాదె! ఏవృత్తి యవలంబనీయ మని యోజింపఁబని లేదు. నియమబద్ధులైనవారి కేదియు నీచవృత్తి కాదు. న్యాయవర్తనులైనచో వారికన్నియు సద్వృత్తులుగాఁ జూపట్టును. లోహములపైఁ జెక్కుట, ఊాతిమలపు, బట్టలుకుట్టుట, నేత నేయుట వృత్తులు గావే? ఇవి యిప్పుడు చదువురానివారి చేతులలో నున్నవి. వానిని విద్యాధికులు గొని యన్యాయము వదలి సంచరించినచో నెంతయో లాభము. మఱియు బేరు పోఁగొట్టుకొన్నవృత్తుల రక్షించి గౌరవవంతములఁ జేసినవారగుదురు. ఎప్పుడు స్వతంత్రవృత్తులన్నియు మనదేశమున విద్యావంతుల చేతులఁబడునో యప్పుడు దేశసౌభాగ్యము కల్గును.

---

# పట్టుదల.

1. మానవులు నిమేషమునుండి నిమేషమునకుఁ గాక యొకపనినుండి మఱియొక పనికిం జనుచున్నారు. కాన మానవజీవితము కార్యజాత మనవచ్చును. అందుచే నేవో పనులఁ బ్రారంభించువారే యెల్లరునై యున్నారు. అయితే సంకల్పమాత్రముననే యెకార్యములునుగొనసాగనేరవు. అనుకొన్న కార్యములు నెఱవేరుటకధికసన్నాహ మావశ్యకము. సంకల్పితకార్యాచరణమున కడు గడుగునకు విఘ్నము లనేకములు తల సూపుచుండును. వానినన్నిటి నోర్చుకొనుట యనునది తాల్మి యను స్థాణుగుణము. తాల్మితో నగచాట్లఁ బడుచు, విఘ్నములతిక్రమించి, వాని నెదుర్కొనుచు ముందునకుం బోవఁజేయు గుణము పట్టుదల. పని సంకల్పించి, సన్నాహముచేసి, సంబారముల సమకూర్చి, విఘ్నముల నెదుర్కొని కార్యసానుకూలము జేసికొన్నవాఁడే పట్టుదలగలవాఁ డను నామార్హుఁ డగును గాని తదితరులు కానేరరు. పనిఁ బ్రారంభించినది మొదలు విజయము చేకూరువఱకు నిరంతరదీక్షతోఁ బాటుపడఁ జేయు గుణము పట్టుదల. స్వల్ప ఘన భేదంబులు లేక యన్ని కార్యముల సాధనమునకుం గావలసిన గుణసముదాయమునఁ బట్టుదలప్రధానమై యగ్రస్థాన మలంకరించును.

2. చేకొన్న యుద్యమమునెడఁ గల దృఢవిశ్వాసమే పట్టుదలకు మూలము. సచ్ఛీలముగలవాఁ డన్నమాటఁ జెల్లించుకొనును. తలంచిన పని సాంతమొనర్చును. కాబట్టి సత్ప్ర

వర్తనగలవానికిఁ బట్టుదలయుండి తీరును. అందుచేతఁ దాఁజేసి కొన్న కార్యమేదియు నాతఁడు నడుమను బరిత్యజించు భీరువు గాక, తాను మంచిది కా దని నమ్మిన వ్యాపారము మొదట సంకల్పింపనే సంకల్పింపఁడు. హృదిఁనాటిన విశ్వాసమే కొండ లంతోలు నంతరాయముల నెదిరింపఁజేయును. మనసారసం కల్పించి చేసిన పనులలోఁ గడకు విజయము చేకూరును. నడుమఁ జిత్తచాంచల్యముతో ముందు వెన్కాల కూగులాడు న రుఁడు తనయుద్యమమున విశ్వాసము లేనివాఁడును, సత్యమన్న గౌరవము లేనివాఁడు ననియే భావింపఁదగును. నీకు సంపూర్ణ విశ్వాస మున్న కార్యము లాచరింపఁ గడంగితివా పట్టుదల యదియే కల్గును.

3. కార్య మేదైన మొదలిడఁ బ్రారంభ శూరత్వమే తొలుతఁ గొంతవఱకు దీక్షగాఁ బనిచేయించుట సహజము. మఱియుఁ గార్యాంతము సమీపించునపుడు తుది చేరువ యగుచున్నదిగదా యనెడి యుత్సాహమునఁ జకచక పని సాగించుటయుం గలదు. అనఁగాఁ గార్యారంభమునఁ గార్యా సక్తియుఁ గార్యాంతమునందుఁ గార్యాంతసందర్శనమును నరు నెదుటకు నడిపించును. ఇఁకఁ గార్యమధ్యమున నుత్సాహము గాని, పురోగమనశక్తిగాని లేక పెక్కండ్రు తాము తలపెట్టిన పనులఁ బరిత్యజించెదరు. ఇచ్చటనే యీసమయములందే పట్టుదలయున్నయెడల నదియే మానవులను ముందంజవేయిం చును. ఏకార్యమందైనను బట్టుదల ముఖ్యావసరము. ఆ

పట్టుదలయొక్క శూన్యత్వముచేతనే నరులు ప్రారంభించిన కార్యమును నడుమఁ బరిత్యజించుభీరు లగుదురు.

4. ఏ దినమందైన నుదయంబునను బరుండఁబోవుటకు ముందును వస్తువులు సమకూర్చుకొనుట సద్దుకొనుట యను పనులు బాగుగనే సాగునుగాని మాధ్యందినకార్యములు జాడ్యముగ సాగును. అప్పుడుఁ బని చుఱుకుగ నడపుటకుఁ బట్టుదల కావలయును. పాఠశాల తెఱచి పని ప్రారంభించిన నెలలో విద్యార్థులు, నుపాధ్యాయులు గష్టపడి పని చేయుదురు. సంవత్సరాంతమున సమీపించుసెలవు పది దినము లున్నవి, వార మున్నది, యని దినములు లెక్కించుకొనుచు నుత్సాహముతోడనే గడపెదరు; కాని సంవత్సరమధ్యమున బనివేడి చల్లారకుండ వారల నడిపించునది పట్టుదలయే. గ్రంథకర్త కృతిప్రారంభమునఁ దుట్టతుదను బాగుగఁ జుఱుకుగనే వ్రాయునుగాని కృతిమధ్యమున వానిని లేవనెత్తి ధైర్య మూది ముందునకు లాగుకొనిపోవునది పట్టుదల. రథికుఁ డారంభమున గమనవేగిమై క్రమముగఁ గాళ్లు వెతికిలవేయును. గమ్యస్థానసందర్శనసామీప్యమున వానికి విసురుగఁ గాలుసాగును. ప్రయాణమధ్యమున వానిని జతికిలఁ బడనీయక ముందునకుం గొంపోవునది పట్టుదల. ఏకార్యమైనఁ బ్రారంభశూరత్వముతో మొదలిడి పట్టుదలలేక నడుమ దానిఁ బరిత్యజించినవారసంఖ్యాకు లుండుటచేతనే 'యారంభశూరత్వ' మనునది యధిక్షేపణసమయోచితసమాసం బైనది. పట్టుదలగలవానియుందీ యధిక్షేపణము రూపఱిపోవును.

5. ఏనరుఁడైనను దాఁ గలుగఁ జేసికొన్న పని మంచిదని యు, దానిని జేసితీరవలెననియు గాఢమగు నమ్మకము పట్టుదలకుఁ గార్యసఫలత్వమునకు సహకారి. అభినివేశ మున్నవ్యక్తి యుత్సాహముతో నంతరాయము లధిగమించి పురోగమనము సాగించి విజయ మరచేతి యామలకంబుం గన్నయట్లు గాంచును. ఇందులకు దృష్టాంతంబుగ సాలెపురుగుఁ బేర్కొనందగును. గూడునల్లుకొను వేళ నాకీటకము పరిమాదమునఁ జూరునుండి తంతువుతో జారి నేలఁబడి యథాస్థానముం జేర నేరీతి ననేకపర్యాయము లెగిరిపడుచుఁ బ్రయత్నించుచుండునో చూడవలసినదే. మనస్సున నున్నపని నెగ్గువఱకు నట్లాతంతునాభము ప్రయత్నించుటకుం దగు హేతువు పట్టుదల. దీనికిందోడుగ దృఢసంకల్పము, కార్యోత్సాహము, ఫలాసక్తి గూడ నోడువం దగును. మును పాఱుపర్యాయములు వైరులచే నోడింపఁబడి కొండగుహాలోఁ దలఁదాఁచుకొన్న మహీకాంతుఁ డొకఁడు సాలెపురుగు పట్టుదలం దిలకించి వెనుకటి యోటమిమాట మఱచి ద్విగుణీకృతోత్సాహముతో ధృతిఁబూని, మఱొక్కసారి శత్రువులం దాకి విజయరమాకాంతుఁడై వెలసె నని వింటిము. ఇట్లే సర్వకార్యసాఫల్యతకుం బట్టుదల గావలయును.

6. అయితే దుర్మార్గుఁడు సన్మార్గుఁడుకూడ నిజకార్యసాధనమునకుఁ బట్టుదలనూపును. ఈయిర్వురలో మొదటివాని దౌష్ట్యవిషయికమగు పట్టుదల నీచమై నివారింపఁబడవలసినదై యుండ రెండవవానిసత్కార్యవిషయికమగు పట్టుదల ఘనమై యుగ్గడింపఁబడవలసినదై యలరారును. అనఁగా

సత్కార్యాచరణమునఁ బట్టుదల ప్రశంసాపాత్రము; వంద్యము. దుష్కార్యములపట్ల పట్టుదల నివారణయోగ్యము; నింద్యము. పరులకు సేగిసేయుసమకట్టి చలపాదితనమున నది సాధించువఱ కన్నపానముల వర్జించి పనిచేసి పట్టుదలచూపుట గర్హ్యము. పరులసొత్తున కాసపడుటే తప్పు; అందునకై పాటుపడుట దోషము. అం దాదిపరాజయమును సరకుఁగొని తత్కార్యమునకు విముఖతఁ జూపక, మగుడ యత్నించుట మహాదోషంబు. ఇదియు నిట్టి యితరదుష్కార్యములపట్లఁ జూపఁబడుపట్టుదల క్షమింపరాని మహాఘోరపాపము. పగఁగొన్నవాని నురగము చంపువఱకుఁ జలపట్టినట్లు దుర్మార్గుఁడు తా ననుకొన్న పాడుపని నెఱవేఱుదనుకఁ బట్టుదలఁ జూపును. ఇది కూడదు. సత్పురుషుఁడు దైవభయమునఁ బాపభీతిని దుష్కార్యములు తలంపఁడు. మొత్తముమీఁద సత్కార్యములందుఁ బట్టుదల యర్హ్యము; ముఖ్యావసరము.

7. ఈ విధముగు బట్టుదలఁ జూపినవారే మనము నేఁటికిని స్మరించుమహనీయులం దనేకులు. మతకర్తలు సంఘ సంస్కర్తలు మొదలగువారు చిరంజీవులై యుండుటకు వారిపట్టుదలయే కారణము. తాల్మికిం దోడుగఁ బట్టుదలయున్నచోఁ బసిడికిఁ దావియబ్బిన చందమున శోభించును. పట్టుదల లేనివా రది పరిశ్రమవలన నలవఱచుకొనఁగలరు. వా రీక్రింద నుదహరించిన మార్గము ననుసరింపఁదగును.

8. మున్ముందుగ నే పనినైన బాగుగా నాలోచించి, దృఢవిశ్వాసముతో దానిఁ జేయఁగడంగి, చేపట్టినది తుదివఱకు

విడువక ప్రయత్నించుటే రాజమార్గము. ఒకసారి కార్యము కలిసి రాకున్న యెడల వెనుకాడక మగుడ నదియే యత్నింప వలయును. తన్మూలమునఁ బట్టుదల యలవడును. ఏమనఁ దక్కిన సద్గుణములువోలెఁ బట్టుదలయు నలవాటుచే నలవడు నదియే సుఁడీ! ఏక్షణమునఁ జేతిలోని పని మానవలె నని బుద్ధిపొడమునో యప్పుడే తత్కార్యసాధనమువలన నీకును నీయాశ్రితులకును గల్గు ప్రయోజనములఁ దలపోయుటచే బట్టుదల యబ్బును. నీకు సత్యప్రియత్వబుద్ధి పట్టుదల ప్రసాదింపుమని యనుదినము పరమేశ్వరునిఁ బ్రార్థించుచుండితివా యెదుటకు ద్రొక్కుకొని పోఁగల బలసాహసాదికంబులం బొందెదవు. పట్టుదలతోఁ బనిచేసి విజయముపొందిన మహాత్ములచరిత్రముల నాదర్శముగఁ బెట్టుకొని నీవుఁ బట్టుదల తఱుగు తరిని వారిదెసం గనులు ద్రిప్పిచూచుట యను మేలగు కార్యమునం జేసి పట్టుదల యొదవును. కష్టములందును మనోరథభంగకాలములందును దదాదర్శపురుషులే నీకు ధైర్యమూఁదగల సమర్థులు.

9. ఈ పద్ధతులఁ బట్టి పట్టుదల గఱచి సత్కార్యములొనరింపఁబూనుము. సహజముగ దుర్బలుఁడవయ్యుఁ బట్టుదల యున్నవాఁడవైనచో నే పనినైన సాధింపఁ గలవు.

# మరణము.

"వేషధారియొక్కఁడు పాత్ర విడిచిపోవ
వేఱొకనిరాక సభ్యులు వేచునట్లు
కాలమందినవానిని గాటఁ జేర్చి
యుదితుఁ డగువానిని కుటుంబ మెదురుచూచు"

జాతుఁడు మృతుఁడగుట ధ్రువము, మొదలగు వేదాంత వాక్యము లెఱుఁగని, సర్వదా స్మరింపని నరపురుగు భారతదేశమున లేదు. అందిమిడియున్న భావ మనుల్లంఘనీయమగు బ్రహ్మలిఖితము. ప్రతివృక్షమును, జంతువును, మానవుఁడును నుద్యమమును బుట్టి కాలానంతరము మరణము పొందితీరును. జంతువు తన దినాంతమున విశ్రాంతిఁ జెందును. మానవులకుఁ, గొన్ని ఖేచరములకు, భూరుహములకు, సత్వములకు రాత్రి నిద్ర. కొన్ని విహంగములకు జంతువులకు మాత్రము పగలు నిద్ర. ఎట్టయిన ననుదినమున నివి పొందు విరామము నిద్ర. ఇందుఁ బ్రతిదియును జీవితాంతమునఁ బొందు విరామము మరణము. నిద్రఁ జెందినవాఁడు మఱల లేచును. మరణమొందిన వాఁడు మఱి మేల్కొనఁడు. అందుచేతనే కాఁబోలు మరణమునకుఁ బెద్దనిద్దుర యను నామమున్నది. నిద్ర జెందినప్పుడు శరీరమునందలి యుచ్ఛ్వాసనిశ్వాసములు రక్తప్రసారము మొదలగు వ్యాపారములు కొన్ని నడచుచునే యుండును. మరణించినప్పుడు సర్వశరీరవ్యాపారములు నుడుగును. మరణింపనున్న రోగిని జాలకాలము పరీక్ష చేయు వెజ్జులు రోగి కొక్కొక్కచర్యయు నుడుగఁ దుది సమీపించుచున్న దందురు. సర్వదేహవ్యా

పారము లుడుగుటయే మరణము. అయితే యోగాభ్యాసము వలనఁ గొంతకాల మవయవస్తంభనచేసి శరీరకార్యము లుడుగఁజేసికొనఁగలవార లుండి రనునమ్మక మున్నది. ఇది నిజమని యొప్పుకొన్నవేళ మరణమును సర్వశారీరక వ్యాపారములు శాశ్వతముగ నుడుగుట యని గ్రహింపవలయును.

2. మరణమున కొక్కకాలనియమము లేదు. పంటపండుట కొక్కకాలము. పంటఁ గోయుట కొక్కకాలము. పక్షులు గ్రుడ్లుపెట్టుటకుఁ బశువు లీనుటకుఁ బ్రత్యేకముగ ఋతువు లున్నవి. అన్నిభౌతికకార్యములకుఁ బ్రకృతిసిద్ధనియమము లున్నవి. వీనికిందోడు మనుజనిర్మితసమయము లున్నవి. మరణమునకు మాత్ర మారీతిగ వేళనియమము వ్యర్థము. కొందఱు రాత్రివేళ మరణించుట యున్నది; పగలు మరణము పొందుట గలదు. వేసవిని వర్షకాలమున శీతున ననేకులు మరణించుచున్నారు. ఒకకాలములోఁ బండ్లు కాయలు గింజలు దుంపలు మిక్కుటముగా మెక్కుటచేత, నొక్కకాలమున నవి లేక తినకుండుటచేత నరులు మరణముపా లగుచున్నారు. తిండికలిమిరూపమునఁ దిండిలేమిరూపమునను మనచుట్టు నీకాల మాకాలమనక నిరంతరము వేయికన్నులతోఁ గనిపెట్టిచూచుచు వస్తువుతో ఛాయయట్లు ప్రాణితో మరణము వెంటనంటి పోవుచునే యున్నది.

3. మరణము దయాదాక్షిణ్యములు లేని దేవత యందురు. దీనికి జాలి నాలిసున్న. ముద్దుముచ్చటలు ముక్కలైనవి. ప్రేమ పెంకులైనది. ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డను,

నవనవాంకుర యౌవనకన్యను, సింహబలునిఁ దరుణవయస్కు-
నిఁ దనవాతఁ బెట్టుకొనును. ఏకపుత్రివిశేష మనికాని, కురంగ
శాబక మనికాని, క్రొత్తకోడ లనికాని, చిగురుజొంప మనికాని
యుచ్ఛదశానువర్తనుఁ డనికాని యీమృత్యుదేవత సందేహిం
పక తనపొట్టఁ బెట్టుకొనుటే నిజధర్మ మని తలంచును. మృత
ప్రాణి బంధుమిత్రవిలాపము లీమెమనస్సును గరఁగింపఁజాలవు.
తా ననుకొన్నవారిఁ గబళించుటే దీనికిఁ బ్రధానముకాని దుర్బ
ల ప్రబల భేదంబు లీమె పాటింపదు. తనకు సహజముగ జాలి ప్రేమ
సానుభూతులు లేకున్నమానె, తాఁ జంపనెంచువాని యాలు
బిడ్డల దుఃఖరోదనములుగాని వేడికన్నీటిధారలుగాని చూచి
యామెయించుకయు మోమోటపడి యొక్కింతయుం దాళను.
పక్షపాతము లేనిదాన నని మాత్ర మీమిత్తి విఱ్ఱవీగును.
సత్కార్యాచరణమునఁ బక్షపాతము లేకుండిన శ్లాఘనీయము
గాని యెల్లరఁ బరిమార్చుచోఁ బక్షపాతము లేకున్నఁ బ్రయో
జన మేమి? ముకుటమాందాతను బొలముదున్ను కర్షకుని,
పేరుగన్న జగదేకయుద్ధవీరుని, బిఱికిపందను, నేండ్లుగడచిన
వృద్ధను; నప్పుడే భూపతనమై యభము శుభము నెఱుఁగని
చిట్టికూనను, సంపూర్ణవికసితలతాంతరాజ్ఞిని, గరవికాససూ-
నంబును, జిరకాలవిఖ్యాత పత్రికారాజమును, బయలుదేరను
న్న పత్రికను నరిసమానచిత్తముతో నీమెయంత మొందించును.
శుద్ధాంతమున హంసతూలికాతల్పమున నత్తరువాసనలఁగమ్మ
తెమ్మెఱల ననుభవించు కోమలాంగిని, దిరిపె మొత్తుకొనుచు నర్ధ
వస్త్రధారిణి యగు ముష్టిదానిని, వసంతమున నంటుమామిడిగు

న్నశిఖరమునఁ గోయని కొసరికూయు గండుకోయిలను నూ ల్లఁ
దిరుగుచుఁ గావు కావని కర్ణకఠోరముగ నార్చువాయసము
ను, రూపపరాక్రమసంపదచే మృగరాజై మెకములగుండె ల
వియ గర్జించు సింగమును వర్షకాలమున మురుగుకుండున దొ
ఱలి ఘుర్ఘురించు సూకరమును మరణదేవతదృష్టిలో నొక్క
టియకాని, వానికిం దారతమ్యంబు గన్పట్టదు. ఈచెప్పినదంత
యుం గన మంటినిఁ బుట్టినసర్వముఁ గడకు మంటిపాలు జేసి
లోకములోఁ గలకొలఁది గొప్పలనెల్ల మిత్తి సరిసమాన
మొనరింపఁగల శక్తియని వెల్లడియగుచున్నది.

4. మరణదేవత బుద్ధిమంతురాలు; యుక్తిపరురాలు.
తనచేతిక్రింద జ్వరాదిరోగములుహత్యలు నకస్మాత్సంభవములు
నను వివిధమరణసాధనములఁ జేర్చుకొని యెప్పుడు నేదో యొక్క
వైపునకు వానిని బ్రయోగించుచుండును. ఉద్యమము ధనము లే
క నశింప, నరుఁడు జ్వరపీడితుఁడై మడియు. పూ వెండవేడిమికి
వాడ, బాటసారి యొడలు తెలియక తప్పత్రాగినవానిచే హతు
డగును. ప్రయాణికుఁడు రైలుప్రమాదమువలనఁ జావ భీరుత్వ
ముచే స్త్రీ యాత్మహత్యగావించుకొనును. ఆయాసందర్భ
ముల మృతవస్తువుపైఁ బ్రేమగలవారలు మరణమునే నిందింపక
మరణకారణ మగు రోగమునో వ్యక్తినో సంభవమునో తిట్టి
పోసెదరు. పాడుజ్వర మనియో యచ్చిరాని నూయియనియో
దొంగయూబి యనియో యెన్నఁ డెఱుఁగని తూమ మనియో
యపూర్వసంఘటన మనియో మిత్తి పేరెత్తకే తత్సాధనమును
నిందించెదరు. మరణ మనిన దప్పు దని నిశ్చయించుకొన్నవా

రును మరణమునే నిందించెదరు. ఇది యజ్ఞానజనిత మని వేదాంతజ్ఞు లందురు. ఏది యెట్లున్నను మరణము లేకుండఁ జేసికొను ప్రయత్నంబుల నేరుం దలపెట్టనే తలపెట్టరు. కాని మశూచినో కాలువాపునో తలనొప్పినో కీళ్ళపట్లనో వైద్యమువలన నివారించి తచ్ఛాంతికై పాటుపడెదరు. ఆ పిమ్మటమాత్రము మరణమురాదా? ఆపాటు ప్రేమకొలఁది నుండును. కాని సర్వవైద్యసాహాయ్యములును, మరణదేవతనిశ్చయమునుముందు పటాపంచ లగును.

5. పదిమందితోఁ జావు పండుగతో సమానము. ఒక్కఁడు జబ్బుపడి క్రమముగఁ దీసికొని శుష్కించి తన్నుఁ బరివేష్టించినవారిమధ్య ప్రాణములు విడుచుట కెంతయో క్లేశము జెందును. సంఘమరణమున నట్టివిచారమునకుం దావుండదు. ఉప్పెన వచ్చి యూళ్లు తుడిచిపెట్టుకొని పోవునప్పుడు, గృహములు పరశురామప్రీతియైననాఁడు, ధూమశకటము లొండొంటిఁదాసి డీకొనినప్పుడు జలమధ్యమున నౌక మున్గెడివేళఁ గలుగు సంఘమరణము లొంటరిమరణములకంటెఁ గీర్తిదాయకములు. అవి నల్గురనోళ్ల శ్లాఘింపఁబడును. ఆ యాసమయంబులఁ బ్రత్యేకవ్యక్తిగతాభిప్రాయములు విషాదకరంబు లయ్యుఁ గలిసి మరణించుట యనునది విచారకరము. 'యుద్ధ మొనర్చుచు రణభూమిని మరణించినవారు స్వర్గసౌఖ్యమును, బిఱికిపందయై యిల్లుదూఱినవారు నరకబాధలను బొందెద రనుట యుద్ధవీరుల విషయమైన పురాతనపునుడులు. పరాక్రమముతో నిమిత్తము లేక యొక్కవిషవాయువుతో దేశము నాశముసేయు నీ

దినములలో నవి వర్తింపవు. ఎల్లరు దురములఁ బ్రాణాన పీలు లేదు కనుక సత్కార్యములం జేసి మంచినడవడి గల్గి యాయుర్దాయము ముప్పాతిక గడపి సంతోషముతో వానప్రస్థముం జొచ్చి మరణమున కెదురుచూచుచుండి దానిఁ బొందుటే మేలైన పథము.

6. మరణమున సవ్యాపసవ్యమరణము లని యున్నవి. అనుభవములన్నియుఁ బొంది ముద్దు ముచ్చటలు తీర జరాగ్రస్తులై యవయవపటుత్వము దొఱంగ చీకి బిడ్డలచేతులలో నరుఁడు మరణించుటే సవ్యమరణము. తల్లి తండ్రి తాత మొదలగువారందఱు బ్రతికి యుండఁగ వారి కాశాభంగముఁ గల్గించి తాను సంసారతాపత్రయ మెఱుంగకే నరుఁడు గతించుట యపసవ్యమరణము. సవ్యమరణమైనను మఱొక్కటైనను జీవి కనాయాసమరణము మేలు. మఱియుఁ జావునకు నీచమని మేలని విశేషణములఁ దగిలించుట మనుజుని వెఱ్ఱిగాని క్రియ యొక్కటియె. ఘటమందున్న జీవాత్మ పరమాత్మతో సంధాన మగుటయే మరణము. జీవాత్మ జన్మపరంపరలలో మరణ మనునది ప్రస్తుతజన్మాంతము, నూతనజన్మోదయము. ఏ మన దేహ మనిత్యము, ఆత్మ నిత్యము. ఈ కడపటివాక్యములు సాధారణులకుఁ దల మించినవిగాన వారిబుద్ధి కందనివి.

7. మహానుభావు లిచ్ఛాధీనమరణు లని పెద్ద లందురు. అనఁగా వా రాత్మనిర్ణీతక్షణమునఁగాని విగతాసువులు కారు. ఇందులకుఁ దార్కాణముగ భీష్మనిర్యాణ ముదాహరింపఁద గును. భీష్ముఁడు రణరంగమున దక్షిణాయనమున గాయపడి

యుఁ బ్రాణములు వీడక యంపశయ్యపై నిలిచి యుత్తరాయ ణాగమనమునకై వేచియుండెను. పుణ్యకాలము వచ్చువఱకు సజీవుఁడై యుండి, యాసన్నయయ్యు దూరమున నిలిచియున్న మృత్యుదేవతను దాఁ బిలిచిన వేళ రా నాజ్ఞాపించెను. యోగు లిట్టి యిచ్ఛాధీనమరణులు. వారిపట్ల మిత్తియాటలు సాగవు. వారియాజ్ఞానువర్తినియై యామె యే మెలఁగవలసియున్నది.

8. మరణించినవాని దేహమును శవ మందురు. మృత కళేబరము భయంకరముగ నుండును. మరణచిహ్నము లీక్రింది పద్యమున నున్నవి తెలిసికొనుము.

"గీ. ముక్కువ్రాలుట కర్ణము ల్మ్రగ్గఁబడుట
రదనవైవర్ణ్య మక్షివిరాగభావ
మంగ మతికృష్ణ మగు టుల్లమడరఁ జెడుట
సూచకములు సద్యోమృత్యుగోచరతకు."

—భారతము.

ఈలక్షణము లెఱుఁగకుండుటచేతఁ బలువురు బంధుగుల మరణసమయంబులలోఁ జిక్కులఁ జిక్కిరి. మృతదేహము చైతన్యము లేక వికృతాకృతిఁ దాల్చియుండును. పూర్వము నరుఁడు సజీవుఁడై యుండఁ దోఁచిన ప్రాణమిత్రులు నాత్మబంధువులే దగ్గర కరుగ వెఱచెదరు. పోయినను వారిలోఁ గొందఱు కాఁటివఱకే పోదురు. పోవువాఁడు పూచికపుల్లయైన వెంటఁ గొంపోవక పుట్టినవాఁడు పుట్టినట్లుగఁ బోవును. వాని సుకృతదుష్కృతములుమాత్రమే యాజీవుని వెంటనంటును.

9. మరణముతో మానవుని శారీరక బాధలు మనస్తాపములు, సంసరణపుటికష్టములు, ప్రాపంచికసంబంధములు, పరస్పరానురాగద్వేషములు మొదలగునవన్నియు ముగియును. ఒకని మరణమువలన వానిబంధుగులు కష్టముల పాలై విచారించెదరు. కాని మరణించినవాఁ డెప్పుడు నదృష్టవంతుఁడే! మరణించినవాని కీర్త్యపకీర్తులుమాత్రము భూమిని మిగులును. అవియుఁ గాలవాహినిలోఁ గొంతకాలమున కంతరించిపోవును. మరణించినవాని కంత్యక్రియలు ఘనముగాఁ జేయుటకంటె జీవించియున్నప్పుడు వానికి స్వల్పము వెచ్చించినను మేలు. జీవి కిచ్చిన పుష్పమైనను బీదగ కిచ్చిన మాలికకంటె నమూల్యతరము.



# మితవ్యయము.

1. మితవ్యయముఁ జేయుట యనఁగా లోభివలె నవసరముపట్లఁగూడ వ్యయము సేయకుండుటగాని, దూబలఅదిండిఁ వలె నొడలెఱుఁగక జుట్టు విఱియఁ బోసికొని యనవసరసమయంబులఁగూడ నెంతయున్ననంతయు వ్యయముచేయుటగాని కాక, యదనున నవసరమగునంత, శక్తికిఁ దగుమాత్రముగ ధనవ్యయమొనరించుటకే వర్తించును. ఇంత వెచ్చించుటే మితవ్యయ మని నియమము లేదు. ఆనియమము వ్యక్తినిబట్టి, వాని యభిరుచి ననుసరించి, యాదర్శాన్నత్యపేక్షమవిశేషానుసరణీయమై యుండును. కొంతమంది తమ యాదాయమునకుఁ బది

మడుంగులకు మించిన వ్యయముఁ గావించియు మితవ్యయము చేయుచున్నామనెదరు. కాని ధనము నిరర్థకముగఁ బోయిన దనుకొనరు. నెలకు లక్ష రాఁబడివచ్చు మహారాజు భోజనములకై మాసమునకు వందలు వేలు వెచ్చించియు లోభి యనిపించుకొనును. నెలకు వంద వచ్చుబడికలవాఁ డందు సంగోరు భాగము వ్యయముచేయుభోజనముమాత్రము గొన్నను, మితవ్యయము చేయువాఁ డనిపించుకొనఁడు. నెలకుఁ బదిరూకలార్జించువాఁడు తొమ్మిది తినియు మితవ్యయముచేసి యర్థసంచయముచేయు పొదుపరి యనిపించుకొనును. ఇందు నియమమేది? నీ కేవిషయపు టర్థవ్యయ మగత్యమో నీయంతరాత్మ నడిగి తెలిసికొనుము. అప్పుడే నీ కేవ్యయ మవసరమో స్పష్టమగును. ఆరీతి నవసర మేదియో యనవసర మేదియో బాగుగ విమర్శించి గ్రహించి యవసరవ్యయమునే చేయుట మితవ్యయమగును. పరిశుద్ధసాత్వికాహారము గౌరవోచితవసనము మానవులకు ముఖ్యావసరములు. వానివిషయమై యర్థవ్యయముచేయుట మితవ్యయమే. కేవలము పిలాసార్థముగవస్త్రాహారములకమితధనము సెలవొపంగుట యనవసరముగాన వానికై మితముగ ధనము వ్యయపరచుటముఖ్యము. భోగమున ధననాశన మున్నదిగనుక యది మన స్సంగీకరింపనిది. అందుచేత ధనము నిష్ఫలముగావ్యయమొనరించుటకు మనకు స్వాతంత్ర్యము లేదు. బిడ్డలు రుగ్ణతగా నున్నప్పుడు వైద్యమునకు వెచ్చించుట మితవ్యయము. దీపావళినాఁడు కాల్చువస్తువులకై వ్యయము దుర్వ్యయము.

2. డాబునకు శివ మెత్తి సంచరించి సర్వస్వము వెచ్చించి కడకుఁ గాళ్లు సాఁచుకొని దారిద్ర్య మనుభవించుట యకార్యకరణమగుట బొత్తుగ తగనిది. ఇంటిపరికరము లున్నకొలఁది మఱియుఁ గావలసియున్నట్లే యుండును. ధనము వెచ్చించినకొలఁది వెచ్చింప బుద్ధియే యుండును. "తిన్నమ్మకే వాపి, కన్నమ్మకేవాపి." ఇంతవట్టు నిజము నైజము. ఎన్నియున్నను లేనివానికై విచారము వసుంధరావల్లభునకును ముష్టింపచునకును సమానముగ నుండియే తీరును. క్షీరములలోనికిఁ బంచదార లేదని ధనియుఁ గంజినీళ్లలోని కుప్పుగల్లు లేదని నిర్ధనియు దురపిల్లుచునే యుండుట తప్పదు. వ్యయము చేయుటకు మొదలిడినచోఁ గొండలు పర్వతములు నాటవు. గండితెగినట్టి తటాకములోన నీరు నిల్చునే. అట్టియెడ ముఖ్యావసరవస్తుసంపాదనకైమాత్రము ధనమువెచ్చించుచు మిగిలినది మూటగట్టుకొనువానికి లేమిబాధ సంభవించుట దుర్లభము. అట్టివాఁ డెన్నండును లే దని పొక్కనక్కఱయుండదు. అసంతృప్తి నిరాశాదులు చిత్తంబులం దగులొక్కనవు. ఇంతకన్న నరజన్మమెత్తినవాని కబ్బఁగల సౌఖ్యమున్న దే? ఈసుఖ మొదవఁజేయునది మితవ్యయము. ఆఁడుబిడ్డల వివాహాదిశుభకార్యములలోను, బంధుగదినంబుల వేడుకలలోను, దీపావళిసరకుగాల్చుపట్లను, మనదేశీయులు గొప్పదనఁపుచిన్నియ యని గర్వముతో లేనిపోని మెత్తు లెత్తి, తమ యాదాయమునకు మించిన వ్యయముచేసి, తీరనిఅప్పులపాలై తుదకుఁ బూటతిండికిని, నిలువనీడకును దూరమై, దారిద్ర్య

ముచేఁ గడగండ్ల మునిఁగి యేమందులును మాన్పఁజాలని మనో వ్యథం బడినవార లధిక సంఖ్యాకు లన్నియూరుల నీ నా నాఁ డెందఱో, చెఱువు లెండినప్పు డొడ్డునఁబడిన మీనుల ట్లున్నారు. అమితార్థవ్యయమువలన సంభవించు నిడుమలు వారింగనినవారల కెఱుకవడును, మఱియు ననుభవించినవారి కెఱుకయగును. జనులు మితవ్యయము నే లక్ష్యముగాఁ బెట్టుకొన్నచో నిట్టి యిక్కట్టులు పుట్టుట కవకాశ ముండ నేరదు. గృహ సౌఖ్యమునకును సంఘసౌఖ్యమునకును హేతుభూతము "మిత వ్యయము మితవ్యయ" మని మితిమీఱినన్ని మాఱులు ఘంటా పథముగఁ జెప్పనొప్పును.

3. మితవ్యయమువలన దారిద్ర్యము కలుగకుండుట యే లాభముకాక ధనము నిలువఁజేసి కొనుటయుం గల్గును. వెచ్చించునాఁడు చేతిలోఁ బడి రాల్లున్నప్పుడు విజృంభింపక తలవంచి మిన్నకుంటివా ధనము పెఱుఁగును. దానఁ గలకాలము తలయెత్తుకొని బ్రతుకవచ్చును. పట్టుదలప్రధానము చేసికొని యొకని మించి యొకఁ డున్న సొమ్మెల్ల వెదజిమ్మి వమ్మొనర్చి యెల్లరును లేనివా రగుటకంటె శోచనీయాంశ మేమున్నది? ప్రతిమానవుఁడు తనముంగిలి తా నూడ్చుకొన్నచో వీధి యంతయుఁ బరిశుద్ధముగ నుండు తెఱంగున, నెవ్వని మట్టునకు నాఁడు మితవ్యయ మొనర్చు ప్రతిజ్ఞఁ బూనినయెడల సంఘ మంతయు సూర్యోదయకాలమునందలి తామరకొలనివలెఁ గలకలలాడుచు లక్ష్మితోఁ దులఁదూగును. మఱియుఁ గష్టించి సంపాదించినదానిలోఁ గొంతభాగముఁ దాచుకొన్నవాని కున్న

ధైర్యము సౌఖ్యము చెప్పనలవికాదు. అక్కఱలాడనినాఁటిగతి యే మను చింతతొలంగును. వ్యాధిగ్రస్తుఁడై మంచముపట్టిన వాఁడు పోషణచికిత్సలకై కలగుందుపడ నక్కఱ లేదు. నిర్విచారమునకంటె మనుష్యునారోగ్యస్థితిలో నుంచు దివ్యౌషధం బెందును గానరాదు. నిలువలేనివాని హృదయస్థితి పగవానికైనఁ గోరరానిది. కాఁబట్టి నీ వెల్లవేళల మితవ్యయమును దృష్టిలో నుంచుకొనుచో ధనము నార్జింపఁగలవు. ధనమున్న వాఁడు దాత కాఁగలఁడు. చేతనాలుగుడబ్బు లున్నయతఁడే లేనివారికింతధర్మముచేసి పుణ్య మార్జింప శక్తిమంతుఁడై యుండు. అట్టి నరుని యశ మదియే వచ్చి చేఁపట్టును. అందుచేత మితవ్యయమువలనఁ దోఁడిమానవతతిబాధలఁ దగ్గింపనుగాని నిర్మూలింపనుగాని శక్యమగును.

**4.** తన వచ్చురాముల మచ్చాన కుచితముగఁ గొంత వ్యయముచేసి, కొంత పొదుపుచేసికొనుచుఁ బ్రవర్తించుటే తెలివిగల్గి మనుగడ యెఱింగినవానికి లక్షణము. వచ్చిన నాఁడు ముందు రానినాఁటిమాట నెద నెంచక సర్వము భక్షించువారు గొందఱు. ఆయమునకుమించిన వ్యయములం దలపెట్టి ఋణగ్రస్తులగువారికంటె వీరు వరిముల్లువాసి మెఱుగనందగును. ఏనుఁగుతొండపు లావుగల రాఁబడి యున్న వాఁడు నూది యురవున వ్యయము చేయవలయునని యనుభవజ్ఞులనుడి. ఇప్పాళపుఁ బ్రవర్తనమందు లుబ్ధత్వము లేకపోవుటయే కాక ముందు రాఁబోవు లేమిదినంబులందలి యనుభవమునకు మిగులున్నది. పిపీలికల నంపాదన వ్యయపద్ధతులు మానవుల

కనుసరణయోగ్యములు. కడుపుఁగట్టుకొని యార్జనమంతయు మూటఁగట్టుకొన్నవాని మిగులు మితవ్యయపు ఫలితముగాక లుబ్ధత్వజనితము. దిబ్బుదిబ్బు దీపావళి పండుగ యని కుప్ప నూర్పుగ నెప్పటిదప్పుడు దులుపుకొని తినువాఁడు తాఁ దిను తరి లోభుల నధిక్షేపించునుగాని క్షామసమయములందును ధర్మకార్యాచరణమందును పిసినారులు ముల్లెమూటల విప్పి పంచిపెట్టఁగల సమర్థులని తలపోయఁజాలఁడుకదా! దూరదృష్టితో దమ్మిడి దమ్మిడి చేసి లక్షలు కోట్లు చేర్చినవాఁడు నవవసరవెచ్చమున కిచ్చగింపఁ జాలఁ డేకాని మితవ్యయ మొనరించును. కాని వానిపైఁ బ్రేమలేనిలోక మీర్ష్యఁ గొని లుబ్ధబిరుదము నడుగఁబడకయే ప్రసాదించును. ఆబిరు దొసంగిన వారలందఱు పేరైన లేక మడిసిపోవ నట్టిలుబ్ధులు బుద్ధిపుట్టినప్పుడు చేసినమహాత్కార్యములు, ప్రారంభించిన సంస్థలు దినదినాభివృద్ధితో నిలిచియున్నవి. మనదేశమునందలి ధర్మశాలలు సత్రములు మొదలగున వెన్నియో దమ్మిడికి దమ్మిడిఁ జేర్చి పెద్ద మొత్తములం జేసిన మితవ్యయాభిలాషుల యౌదార్యగుణనగ ఫలితంబులేయని మఱువకుఁడు.

5. మితవ్యయాభ్యాసమువలన సత్ప్రవర్తన మలవడును. తద్వ్యయ మాదర్శముగఁ బెట్టుకొన్నవాఁడు కొన్ని భోగములనువిలాసములను వేడుకలను క్షణకాలికములని కసిపెట్టి యాత్మనిగ్రహముం జూపును. ఆత్మనిగ్రహము లేనివాఁడు చేతఁగల బేడయు నుదయపానీయములకుఁ బొగచుట్టలకు వెచ్చించి, పైకెక్కి పెద్దపిన్న తారతమ్యమును మఱచి వావివరుసలులేక

యెల్లరనీసడించుచుఁ బ్రవర్తించుచుండఁగా, మితవ్యయములక్ష్యమున నుంచుకొన్న వాఁడు ముక్కుపట్టి లాగుభోగాశను నిగ్రహించి బేడ మిగుల్చుకొని యంగవిహీనులకు నిరుపేదలకు దమ్మిడీ దమ్మిడిగ దానముచేయుచుఁ బుణ్యసంచయ మొనర్చుకొనుచుండును. మితవ్యయము చేయువాఁడు కొన్ని నియమముల బాటించును; దన్నియమబద్ధుఁడై యుండుట కిచ్చగించినచో మితవ్యయ మది యే యలవాటగును. అట్టి నియమబద్ధజీవనమే మానవునకు గొప్ప నైతిక శిక్ష. బుద్ధిని, నీతిని, శీలమును దూబఱదిండితనము చెఱుప, వానిని మితవ్యయ మభివృద్ధిగావించును. దూఁబఱదిండితనము బలమును బుంస్త్వమును వమ్మొనరించును; మితవ్యయము వానిని బెంపొందించును.

6. కేవల లుబ్ధత్వముకాని దూఁబఱదిండితనముగాని నీచము. మితవ్యయమే సర్వశ్రేయోమూలము. ఆర్జింపఁగల శక్తి ప్రతివ్యక్తికిం గలదు. అది వ్యయముచేయు శక్తియుం గలదు. ఆర్జించినదానిలో నవసరవ్యయముమాత్రము పోను మిగులుచు శక్తి గలిగియుండుటే యరుదగు మితవ్యయము. ఇంతవినినపిదప నీవు బుద్ధిమంతుఁడవైనచోఁ గోరి యాచరణమునఁ బెట్టవలసినది మితవ్యయమే సుమీ!



# భూ త ద య.

క॥ సమదర్శియై యఖిల భూ
తములను దనయట్లు కాఁగఁదలఁచును నెవ్వాఁ
డమలన్యాయపరుండగు
నమరు లతని వందనీయుఁ డంద్రు నరేంద్రా!

—భారతము.

1. భూతములయందు దయఁగలిగియుండుట భూత దయ. భూతము లేవి? 'పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము' అను నవి పంచభూతములు. వీని ప్రశంస భూతదయ కాదుకాని భూతదయయం దొకవిధముగా నివి యిమిడియే యున్న వనవలసియున్నది. పిశాచము లన భూతము లని వాడుక యున్నది. ఆభూతప్రసక్తి నిందుఁ జొన్పుట యభూతకల్పనమే. భూతదయా సమాసపూర్వోక్తపదముగఁ జేర్పఁబడిన భూతమునకుఁ బ్రాణి యని యర్థము. భూతదయ యనఁ బ్రాణి కోటిపైఁ గరుణఁ గలిగియుండుట యని భావము. ఈగుణము సర్వప్రాణుల కగత్యమై యున్నది. అందున జ్ఞానవంతుఁ డని విఱ్ఱవీగు మానవుఁడు తోడివారిమీఁదను దక్కఁగల జంతు వృక్షవిహంగంబులమీఁదను గరుణ నవ్యాజముగఁ జూపుట యావసరము. భూతములపై నెనరుఁజూపుట భూతదయ.

2. దెబ్బతగిలినను, కాలిలో ముల్లుగ్రుచ్చుకొన్నను బ్రాణ మెంత విలవిలలాడునో సర్వజనానుభవము. ఒకని చేయి తెగిన రక్త మెట్లుస్రవించునో, తీ పెట్లు మనస్సును వేధించునో, కోతవడినచోట నెట్టిగాయమగునో తెలియనివిషయ

ము కాదు. నరుఁడు దేనికైన నొప్పుకొనునుగాని, తన ప్రాణాపాయము నొల్లఁడు; తన దేహహాని నిచ్ఛగింపఁడు. వైద్యుఁడైన నితరులకంతులఁ గోయఁగలఁడుకాని తనకంతి గోసికొనఁజాలఁడు. ఏజీవికైనను దనప్రాణముకంటె మధురతరమైన దింకొకటి గాన్పింపదు. గోదావరిలో నొక మున్గుచుండ లోపలనున్న వాఁ డెవ్వని ప్రాణముల వాఁడు దక్కించుకొనఁ బ్రియత్నించునుగాని యితరుల నెంతయాత్మబంధువులనైన రక్షించుటకుఁ దొల్తఁ బ్రియత్నింపఁడు. సాల నిప్పంటుకొన్న వేళ, నేజంతువున కది తప్పించుకొనఁజూచి కట్లుతాళ్ల బలవంతమునఁ ద్రెంచికొని బయుటపడఁజూచును. అనఁగా నేజంతువునకైనను స్వప్రాణమునకంటెఁ బ్రియతరమైనది లేదు. ఆత్మప్రాణరక్షణమునకన్నఁ బని లేదు. జీవితవ్యాపారములన్నియు నరుని నిజప్రాణావనమునకే. తనను గాపాడుకొన్నట్లే నరుఁ డితరులఁ గాపాడవలెను.

3. తననొకఁడు గొట్టఁ దా నెంత బాధఁ జెందునో నరుఁడు తాఁగొట్ట నితరు లంత బాధఁ జెందెదరు. నరుఁడు తన వ్రేలు గోసికొన్న రుధిరముగారునట్లే యితరసత్వముల కాయంబుల గాయంబు లొనర్చినచో నందుండియుం గీలాలము జారును. వృక్షములం దెగఁగొట్టినచో నాతావులనుండియు రసము ధారలు గట్టును. తన ప్రాణమును గాపాడుకొనుటయొకటి, యందు నిమిత్తము పరులప్రాణములఁదీయుట వేఱొకటి. తన కపజయము, హాని, ధనక్షయము, బంధునాశనము, తిండిలేమి మొదలగునవి సంభవింప నరుఁ డమితబాధఁ జెందును. తద్విధ

మున నితరులుకూడ బాధఁజెందెదరని తలపోయుట, వారి బాధల నివృత్తిఁజేయుట, వారి కుపకారము లొనరించుట, యనునవియే భూతదయాతత్త్వము. తన్నుఁగోయఁ బాలుగారి యొరులఁగోయ నీరు గారునా? ఎల్లరక్షతదేహములనుండియు రక్తమే కారును. అట్టిచోఁ దనవంటివారలే యితరులని వారికి మేల్లొడఁగూర్చుటయుఁ గీల్లొనర్పకుండుటయు భూతదయా రహస్యము. 'ఆత్మవత్సర్వభూతాని'యని తలపోసి యాచరణ మం దది పెట్టునతఁడే భూతదయాపరుం డనఁ దగినవ్యక్తి.

4. ఎందుకొఱకు భూతదయగలిగి మానవు లుండవల యు నన్నచో సమాధాన మీక్రింది కందమం దున్నది.

క. భూతముల కలుగునతనికి
భూతము లఖిలమ్ము నలుగు భూతహితార్థీ!
భూతతతి కభయమిచ్చిన
పూతాత్మున కభయమిచ్చు భూతావలియుణ్.

— భారతము.

అందునిమిత్తమే యైనను భూతదయఁజూపుట మానవు నకు ధర్మము. బాధపడుశరీరభాగము వైపుఁ దక్కిన భాగము లన్నియు దృష్టిఁబఱుపును. బాధపడు బందుగుని వైపుఁ దక్కిన బందుగులందఱు వాత్సల్యముఁ జూపెదరు. అట్లే యేప్రాణిని కామయాదికంబులు దటస్థించినఁ దక్కినప్రాణులన్నియుఁ దోడగుట ధర్మము.

5. భూతము లసంఖ్యాకములు. నీతోడిమానవులు నీవు పెంచుజంతువులు, వన్యసత్త్వములు, పక్షులు, జలచరం

బులు మొదలగునవి స్థూలదృష్టికిం గోచరించెడివి. ఇవియే సర్వజీవు లనరాదు. మానవుని యంత్రసాహాయ్యశూన్యదృష్టికిం గోచరించునవిగాక యనేకకోట్లజీవరాసు లీప్రపంచమునం గలవు. అవి యంత్రసాహాయ్యమునం గన్పట్టు సూక్ష్మజీవులు; నీటను మంటిని గాలిని నివసించుచున్నవి. నీతలలో జీవులు, మేనిపై జీవులు, దేహములోపల జీవులు, నీవు కాలు కదిపిన జంతువులపైంబడును. చేయిందిప్పిన జంతువులకుం దగులును. వీనికిందోడుగ వృక్షములు ప్రాణులు గలవి. పచ్చగడ్డి పోంటక మొదలు వటవృక్షపర్యంతముగల భూతము లనేకంబు లున్నవి. పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల భూతములసంఖ్య నెన్నందరంబె? గణింపవీలుకాని యధికసంఖ్యగల జంతువులను దయతోంజూచుటయన్నం గష్టము. ఓమానవుండా! నీవు నవ నాగరకుండనవియుం బ్రకృతినంతయు లోంబఱచుకొని దానిచే నూడిగము చేయించుకొనుచుంటివనియు బీరములం బల్కెదవే! నీబడాయియంతయు జీవహింసపై నాధారపడియున్నది. పునాదియే చెడ్డదైననాండు పైకట్టడమంతయు నట్టిదియకదా! జీవహింసచేయక గౌరవమార్జింపవలయును. సంసారములో నుంటివా జీవహింసాచరణ మవశ్యకర్తవ్యమగును. కావున నరుండు భూతదయాపరుండనిపించుకొనుటకు సన్యాసివైమనుట యుత్తమోత్తమమార్గము. సంసారములో నుండందలంచిననాండు వాండు యోజించి యేపనిం జేసినచోం దక్కువ జంతుహింస యగునో నిర్ణయించి యధమ మాపనియైనం జేయవలయును.

6. భూతదయగలిగి ప్రవర్తింపఁదలఁచుకొనినవాఁడు మెలఁగవలసిన దెట్లు? భూతహింసాకరములగుకార్యములాచరింపకుండుటయే కర్తవ్యము. కాలుతీసి కాలుమోపునప్పు డడుగు పురుగుపైననో పిపీలికపైననో, పడి ప్రాణాపాయము సంభవింపఁజేయును. నీవొసఁగఁజాలని ప్రాణము నీవు సులభముగ ననాలోచితముగఁ దీయఁగడంగు టెంతపాపకార్యము? కాఁబట్టి వివేకబుద్ధితోఁ ద్రికరణశుద్ధిగ జంతువుల కపకారములగు పనుల మానుకొనుము. కొందఱు విద్వాంసులు పానీయపాత్రల దోముచో సూక్ష్మజీవులు నశించునని తోమని చెంబులనే వాడుకొనెడివారఁట. అదేకారణముచేఁ దడిబట్టల నుదుకకయే యారఁగట్టుకొనెడివారఁట. అట్టి దయాపరుల కునికిపట్టయిన భారతదేశములో మాంసము దినెడివారిప్పటికిని నిల్చియుండుట సిగ్గు. విషజంతువులగు పాము, తేలు మొదలగునవి కంటఁబడినను వానిఁజంపక విడిచెడివా రిప్పటికిని నందందున్నారు. స్వేచ్ఛగాఁదిరుగు విహంగంబులను జంతువులను బెంచుచున్నా మను నెపమునఁ బంజరంబుల బోనుల వానిని బెట్టి చెఱపెట్టువారిని పెద్దలు నిందించుచుందురు. ఏల? ఆసత్త్వముల స్వేచ్ఛకు భంగమువాటిల్లినది కాదా? రోగముచే బాధిల్లు జంతువులఁ దుపాకితోఁ గాల్చి చంపి వాని బాధఁ బాపుట పాశ్చాత్యులయాచారము. ఆపలుకే భారతీయునకుఁ గర్ణకఠోరముగనుండును. పరుల మోసగించుట, వారి కేవిధమగునపకారమేని యొనర్చుటకూడ జీవహింసలోనే పడును. అవి వర్జింపఁదగును. భూతదయ కహింస ప్రథమసోపానము.

అహింసావ్రత మసిధారావ్రతమువలెఁ గఠినమైనది. తద్వ్రతావలంబకుఁ డితరజీవులను దూషింపఁడు. వానికిఁ గీడు మనోవాక్కాయములఁ జేయఁడు. అతఁడు భౌతిక సంబంధములు త్యజింపవలసినవాఁడగును. ఎక్కడ నెప్పు డేమిచేసిన నే భూతములకు నష్టమో యని తిండికూడమానుకొని నిరశనవ్రత దీక్షావలంబకుఁ డగును. చల్లని చిత్తవృత్తి నెల్లరపై మలగించును. సకలభూతములయందు మార్దవయుక్తుండగును. అహింసావ్రత ముత్తమలోకములఁ గూర్చును. భూతదయఁగలిగి యుండుట యన్నఁ గృపచిగురొత్తుచిత్తంబుతో నహింసావ్రత మారంభించుట. ఇది మానవుని విధాయకకృత్యము.

ఆ॥ వె॥ దంతియడుగులోనఁ దక్కినజంతుచ
యంబునడుగులెల్ల నడఁగియుండు
నట్ల ధర్మకోటు లన్నియు లోనగు
నిర్ధగుణ! యహింస కింత నిజము. —భారతము.

7. అహింసావ్రత మవలంబించినపిదప నరుఁడు చేయవలసినది భూతముల కుపకారము. శక్తికొలఁది పరజీవులకు మేళ్లొడఁగూర్చుట యుక్తము. జంతువులఁబోషించుట, యాకొన్నవాని కన్నమిడుట, పిపాసఁగొన్నవానికిఁ బానీయ మిచ్చుట, సంపాదనలోఁ గొంతపాలు భూతబలియొసంగుట, దీనులకు సాయ మేవిధముననైనఁ జేయుట భూతదయయగును. ఎఱిఁగియు నెఱుఁగకకూడఁ జేసిన పనులవలనఁగలిగిన పాపమును బోఁగొట్టుకొనుట కిది సాధనము. చీమలపుట్టలకై వెదకి కలకండయో నూకలో వేయుటయు, భోజనారంభమున

భూతబలి యొసంగుటయు, వేసవివేడికి సొక్కినజంతువులకు నీరములు పోయుటయు, వఱదలు తుపానులు భూకంపములు మొదలగువానిమూలమునఁ జెడి దుస్థితిలోనున్నవారికి సాయ మొనరించుటయు, భూతదయాప్రబోధితకృత్యములే. ఉపకారి యపకారి యనుభేదము గణనసేయక యెల్లభూతములపై నెనరుఁజూపుటయే భూతదయ.

8. భారతీయుల కహింసగాని భూతదయగాని బోధసేయుట కమ్మరవీధిని గఱెలు లమ్ముట వంటిది. ఇది వేదకాలము నాఁటినుండియు సాంప్రదాయసిద్ధముగ వచ్చుచున్నది. గౌతమబుద్ధుని బోధాసారమంతయు నహింసాధారము. అహింస లేనిచో బౌద్ధమతమే లేదు. నేఁటిదినమున నీభూతదయయే మహాత్ముల యహింసావ్రతాచరణమున లోకవిఖ్యాతిఁ గన్నది. అట్టిజగన్నుతిఁ గన్న విస్తారవ్యాపృతవిషయమునుంగూర్చి యధికముఁ జెప్పఁబూని యవకతవకలు వ్రాయఁబూనుట కంటె బుద్ధుని బోధనములను ఇతరమతగ్రంథములను బరిశీలించి యాభూతదయావ్రతదీక్షఁ బూని సుఖింపుఁడని హెచ్చరిక చెప్పి 'అహింసా పరమోధర్మః' యని భూతదయావ్యాసము ముగించుట మేలు.

---

## మూఢవిశ్వాసము.

1. మూఢవిశ్వాసము ప్రతిదేశమునం గలదు. అదిలేని జాతి యుండదనియు వ్యక్తియుండ దనియుఁ గాల ముండదనియు

ఘంటాపథముగ వాకు్రిచ్చనగును. భారతదేశములో మూఢమగు నమ్మకము లనేకము లున్నవి. ఎంతటి విద్వాంసుడైనను బరుల మూఢమగు నమ్మికల నిరసించునేగాని యాత్మీయ మూఢవిశ్వాసముల సమూల మూడబెఱుకఁ జాలఁడు. నీవు పనియేదైనఁ బ్రారంభించునప్పు డితరులు తుమ్మినయెడల నాపని సానుకూలము కాదనునది మూఢమగు నమ్మిక. స్వకీయకార్యమునకును బరకీయతుమ్మతమునకును సంబంధమేమని గాని, యాతుమ్మ నీకార్యము నెట్లుబాగోగులఁ జేయునని గాని నీవు యోజింపవు. అనుకొన్న పనిఁ బ్రారంభింపవు. ఒకవేళఁ గార్యముల యొత్తిడిచే మొదలిడినను నీలోమూఢమగు నమ్మిక నేళ్లుబాఱియుండుటచేత నాపని చేయుచున్నంతసేపును నీ మనస్సు వెనుకకు లాగులాడుచుండును. నీచిత్తము గుంజాటనలో నీకార్యానురక్తి చెడుచునే యుండును. తుదకుఁ గార్యము గలిసివచ్చినయెడల మఱి దుశ్శకునమును దూషింపవు. ఆకార్యము గలిసిరాకున్ననాఁడు నీప్రయత్నబలహీనతను బట్టుదలలేమినిగాక తొలుదొల్తఁ బనియారంభించునాఁడు తుమ్మినవానిని దుంపలు మొదళ్లు తెగునట్లు తిట్టిపోయుదువు. వారిం గనినప్పుడు పెడమొగము పెట్టెదవు. వారివెనుక మెటికెలు విఱిచెదవు. వారిఁగూర్చి దుర్వార్త లేవియో బయలుదేరదీసి వారికీర్తికి భంగము గల్గింప యావచ్ఛక్తిని వినియోగించెదవు. వారు నీకు గర్భశత్రువులట్లు భావించి వారిని దప్పించుకొని తిరుగఁజూచెదవు.

2. కొన్ని సంభవములమీఁదగాని కొన్ని కార్యముల మీఁదగాని కలుగు నకారణ నిరాధారవిశ్వాసమే మూఢ మగు నమ్మిక యని విబుధులందురు. అగోచరగూఢశక్తి యే దియో తన కపకారముచేయునని విశ్వసించుటే మూఢవిశ్వా సము. ఈశ్వరునిపై భక్తి నెలకొల్పి మనసు దిటముచేసికొను టకు మాఱుగ కీడు మేళ్లొదవింతు రని క్షుద్రములైన యజ్ఞాన సృష్టదేవతలపై భయభక్తులఁ బాదుకొల్పుకొనుటయే మూఢవిశ్వాసము. తప్పుదారిఁ ద్రొక్కిన యీభక్తియే మూ ఢవిశ్వాస మనంబఱగు. కొన్నిశకునములు తటస్థించినప్పుడు నీకుఁ గీడో మేలో యొదవునని స్వభావసిద్ధముగ నమ్ముటయే మూఢమగు నమ్మకమునకు లక్షణము. ఆ తటస్థములవలన నీ కెట్లుపకారాపకారములు గల్గునో చెప్పుమని యెవ్వఁడైన బ్రాజ్ఞుఁడు నిన్ను నిలఁబెట్టి సాగదీసి యడిగినయెడల నీవు తెల్లమొగముఁ బెట్టి మిన్నకుండెదవు. నీ భయమునకుం గార ణముఁ దెలుపఁజాలవు. కాఁబట్టి కారణములేనట్టి భయసంభ్ర మహేతువులగు శకునములపై బుద్ధినిల్పుటయే మూఢవిశ్వాస మనంబడును.

3. హేతుహేతుమద్భావసంపత్తితోఁ దులఁదూగు నాధునికప్రపంచము మూఢ మగు నమ్మికల సరకుసేయ దనియుఁ బ్రకృతిశాస్త్రజ్ఞానభూయిష్టహృదయములు సంభ వమునకు ఫలితమునకుఁగల సంబంధ మారసి తెలిసికొనిననే గాని కేవల మూఢవిశ్వాసముల విశ్వాస ముంచదనియుఁ గొంద ఱనుకొనవచ్చును. ఎందుచేతననగా సందేహము నవ

నమ్మిక మానవుఁ డుగ్గుపాలతో గఱచినవిద్య. పాలుద్రావు పసిబిడ్డ తల్లి చెప్పు కథనంతయు నాలించి 'అమ్మా, యీ కథ నిజమేనా ?' యని ప్రశ్నించుట యిందులకుఁ దార్కాణము. ఇఁక విద్వాంసుల ప్రమేయమును తలపెట్టితిమా వారు మూఢమగు నమ్మికల సంపూర్తిగ నిరసించెదరు. కాని యెంత త్రోలిన నవి వెనుకచూపుతో మగిడివచ్చి యంటిరింతలవలెఁ బట్టుకొని వదలవు. కావుననే నవనాగరకత జ్ఞానసంపత్తి గల యీనాఁడుకూడ నన్నిదేశముల నన్నిజాతుల విచిత్రమూఢ విశ్వాసములు ప్రబలియేయున్నవి. ఇతరులను మూఢవిశ్వాసముల నిందించువారేగాని అంతయో కొంతయో మూఢ విశ్వాసగ్రస్తులు కానివా రెందరును లేరు. బల్లిపలుకులు, తీతువుపిట్ట కూతలు, ప్రయాణోన్ముఖుల శకునములు, భుజస్పందనములు, కంటి యదరిపాటులు మొదలగున వన్నియు సుఖ దుఃఖ హేతువు లనునవి మూఢవిశ్వాసములే. వానిచేఁ గట్టువడనివాఁ డుండఁడు. మూఢమగు నమ్మకములుగల వారిఁ జూడనైన నొల్లక నిరసించుచు విజ్ఞానసంపన్నులమని విఱ్ఱవీగు దొరలుగూడఁ బహుముగ్గు రొక్క భోజనపుబల్లదరిఁ జేర నొల్లరు. ఇదేరీతి నేడ్వురు భోజనపంక్తిని జేర మనవార లొప్పరు. ఈ ప్రకారమే మనకు మార్జాలదర్శనము, దివాంధపురుతము విధవశకునము మొదలగున వన్నియుఁ జెఱుపు సేయునని నమ్మకము మూఢవిశ్వాసము గాక యన్యం బెట్లగును.

4. మన చుట్టునున్నవారేదియన్న నదియే మన మనవలయును. ఒకప్పుడు భూమియే స్థిరముగనుండ సూర్యుఁడు దానిచుట్టుఁ దిరుగుచుండెనని లోకమంతయు నమ్మినదినములున్నవి. ఆ దినములలో సూర్యునిచుట్టు భూమియే తిరుగుచుండెనని యన్నవాఁడు ఎగతాళి సేయఁబడెను; దండింపఁబడెను. రానురాను సూర్యుఁడు మధ్యనుండ భూగోళ మాసూర్యునిచుట్టుఁ దిరుగుచున్నదని యొక్క మహానుభావుఁడు స్థిరపఱచెను. నాఁటినుండియు నేఁటివఱకదియే నమ్ముచున్నాము. ఇప్పుడట్లే యననివారిఁగని యెగతాళిచేయుదుము. శాస్త్రాధారము ప్రయోగాధారముగల వాని విషయములైన నమ్మకములే యిట్లు మాఱుచుండ విపరీతములైయుండ మూఢవిశ్వాసములు స్థిరములైయుండి విశ్వసనీయములు గావలెననుట వెఱ్ఱి.

5. దేశదేశములఁగల మూఢవిశ్వాసములు భిన్నభిన్నములుగ నుండునని పైనఁ జెప్పితిమి. ఒకప్పుడు కొన్ని దేశములకు సమాన మూఢవిశ్వాసము లుండవచ్చును. కుక్కలు మొఱ్ఱోయని రోదనధ్వనితో మొఱిగినవీధిని మరణము సంభవించునని నమ్మి వీధులందు గుక్క లారీతిని మొఱుగుచో జనులు వానిని దఱిమెదరు. తక్కిన సమయంబుల శ్వానరావంబుల నలక్ష్యమొనర్చినను గృహంబున రోగి యున్నప్పుడు రోగిబందుగులు కుక్కలను దఱిమి దుడ్డుకఱ్ఱలతో మోదెదరు. ఆ రీతిని దఱిమి సారమేయముం గొట్టినమాత్రమున రోగి జీవించునా? ఇది ప్రాక్పశ్చిమదేశవాసుల కెల్లరకుం

గలమూఢవిశ్వాసమే. ఇట్టిదిగాక మనదేశమునకుఁ బ్రత్యేక ములగునవి కొన్నియున్నవి. ఉత్తరవైపు తలగఁబరుండరాదు. భోజనపంక్తి నేడువిస్తరు లుండకూడదు. ఇత్యాదు లూహ్యాంబులు.

6. మూఢవిశ్వాసములకు మూలమేమి? మరణము తీతువుకూత కాకతాళీయముగ నొకప్పు డెప్పుడో సంభవించి యుండును. యదనన్తరన్యాయమున వెంటనే మరణమునకుఁ దీతువుకూత హేతువని సూత్రము కల్పింపఁబడియుండును. దానినే యెల్లరు నమ్ముచున్నారు. అంతియకాక తీతువు నెవ్వఁ డైనఁబట్టి దానిచేఁగూయించి, కూసినపుడెల్ల మరణముగల్గుట గన్నవాఁడున్నాఁడా? అట్లు నిజముగ జరుగునా? యుక్తిపరులు దీనికొక్క సమాధానము చెప్పెదరు కాఁబోలు. బలవంతముగఁ గూయించినకూతలుగాక సహజరుతములు మరణసూచకము లని వారందురు. అయితే మరణసమయములం దెప్పుడు నా రుతములు వినఁబడునా? అవి వినఁబడినప్పుడెల్ల మరణంబులు సంభవించునా? ఏదియు లేదు. కాని మూఢవిశ్వాసముమాత్ర ము నిల్చియున్నది. కార్యకారణజ్ఞానము లేక తొందరపాటునఁ దైత్తిరీయరుతము మరణసూచకమని నొక్కి యొక్కప్పుడెవ్వఁడో వాక్రువ్వ నది వ్యాపించి వంశపారంపర్యముగఁ బ్రాకి లోకములో వేరులుబాటి నిల్చినది. అదేరీతి నొకదినమున ధనలాభము నొం దినవాఁడు నాటి యుదయంబున నెవ్వని మొగంబుం జూచితినో యని యూహసేయును. సువాసినీదర్శనము నిద్ర మేల్కాంచి నంతనే యైనది గనుక ధనప్రాప్తి యయ్యె నని మూఢమగు

నమ్మిక కల్గును. దినమునఁ బ్రప్రథమమున సువాసినీదర్శ
నము ధన మొనగూర్చునని మూఢవిశ్వాసము. ఇది మూఢ
మగు నమ్మికయే కాకున్న ననుదిన మొందఱో తాము నిద్ర
మేల్కొనినంతనే సువాసినులఁ జూతురే? వారందఱు ధన
లాభము నొందుచున్నారా? అయినను పైనఁ జెప్పిన విశ్వా
సము నిలిచియున్నది. సాధారణముగ భయంకరమై యసహ్య
కరమైన వస్తుదర్శనము దుఃఖహేతు వగుననియు, రమణీయ
మై ప్రియమైన వస్తుదర్శనము సుఖహేతు వగుననియు నమ్ముటే
మూఢవిశ్వాసమునకు మూలము.

7. కొందఱు బయలుదేరుచో దుశ్శకునముం గని
ప్రయాణము మానెదరు. తొందరవ్యాపారము లున్నవారు
సుశకునముకొఱకు వేచియుండి బయలుదేరెదరు. లేదా,
యింటిలోని పుణ్యస్త్రీలఁ గొందఱఁ గొంతదూరము బంపి
తమ కెదురు రమ్మనెదరు. ఇవి బలవంతముగ రప్పింప వచ్చి
నవిగావా? వీనివలన మనస్సునకుఁ దృప్తియే కాని ఫలము
శూన్యము. ఇట్టివారిని హేళనచేయుటకే కాఁబోలు వెనుక
తుమ్ము ముందునకు లాభము, వరుసను రెండు దుశ్శకునము
లొక్క సుశకునమునకుఁ దుల్యమని కల్పనములు చేయఁబడి
నవి. ఇప్పుడొక కథ వినుండు. పూర్వ మొక భూనేత గలఁడు.
అతఁ డుదయముననే నిద్రలేచి వీథిలోనికిం దొంగిచూచెను.
వీథి నేగు నొక బాలుఁడు వానికంట పడెను. అటుతరువాత రాజు
గుఱ్ఱపుస్వారిఁ జేయుచుఁ గ్రిందఁబడఁబోయెను. ఎన్నఁడు లేని
యిట్టి సంభవమునకు హేతువు బాలకదర్శనమని నిశ్చయించు

కొనెను. అధికారము చేతిలోఁగలదుకనుక బాలుని బిలిపించి వాని కురిశిక్ష విధించి కడసారికోర్కెఁ గోరుకొమ్మనెను. దానికా బాలుఁ డడలక రాజుతో సంభాషింపఁగోరెను. నృపాలుఁ డందులకు వల్లెయనెను. అంత బాలుఁడు 'రాజా! నేఁడు ప్రథమమున నన్నుఁ జూచుటచే నీవు తురగముమీఁదినుండి క్రిందఁబడఁబోయితివి. కాని నేను నీముఖారవిందసందర్శనమును తొలుదొల్త నొనరించుటచే నా కురిశిక్ష యైనది. దీని కేమందువనెను? రాజు తెల్లబోయి మంచివాఁడగుటఁ దన తెలివితక్కువతనమునకుఁ జింతించి బాలుని సంరక్షించెను.

8. కడకు నిజము చెప్పవలసివచ్చినయెడల మూఢమగు నమ్మికలన్నియుఁ జెడ్డవి. వానివలనఁ గీడుగల్లు నన్నవాఁడు వానిఁ దలంచి లక్ష్యము సేయుదురు. వానినే నమ్మియున్నవారు సోమరులై ధైర్యసాహసములకు దూరులై పౌరుషహీనులై చెడెదరు. అతిగా ముందువెన్క లారయుట, పిఱికితనమును, హృదయానిశ్చలత్వమును, మూర్ఖతను బుట్టించునవి మూఢవిశ్వాసములు. అనుదినవ్యాపారములలో ననేక ప్రవర్తనానియమములు మూఢవిశ్వాససంజనితము లగుట, దేని కేది కారణమో, యేది ఫలితమో నిశ్చయింపఁజాలక యెంతటి విద్వాంసులును మూఢవిశ్వాసములకుఁ జేఁజిక్కియున్నారు. నూటికిఁ గోటి కొక్క బుద్ధిమంతుఁ డెవ్వఁడో మూఢవిశ్వాసములకు హృదయంబునఁ దా వొసంగక, పిడుగునకు వారశూల యేమని చరియించు. పరీక్షించి యర్థవిమర్శన చేసి ఋజువుచేయ వీలైనవానినే నమ్మవలయును. మూఢ

విశ్వాసము లపాయహేతువులు. ఇంతటితో నీ మూఢవిశ్వాస రచన సరిగాని మూఢవిశ్వాసమునకుఁ దుది యేది?

# అ ల వా టు.

1. అలవాటున కర్థ మేమి? ఏ పనినైన నొక్కఫక్కిని జేయు చేతివాలుదనమునకు, బుద్ధిపోకడకు నలవా టని పేరు. ఆ పోకడలు కర్తకుఁ దెలిసినను దెలియకున్ననుగూడ సంతతాభ్యాసఫలితములు. వేకువనే యనుదినమున నిద్రలేచువాని కనుదినము వేళకు మెలకువ రప్పించునదే యలవాటు. మీసములు దువ్వుకొనుట కలవాటుపడినవాని చేతిని మీసములు పోయినతరువాతఁగూడ చెయ్యిమూఁతిమీఁదికి లేవనెత్తునదలవాటు. ఆ తెనిమిదు లెంత యని ప్రశ్నింపఁ బనివాం డొక్కము మొదలు దొరకొని చెప్పుచు నాతెనిమిదులవరకు వచ్చిగాని యుత్తరమీయరు. వారి నట్లే చేయనిచ్చిన నదియే వారి కభ్యాసమై నిలుచును. ఇదేరీతిని మానవుఁడు ప్రభాతమున లేచినదాది సుషుప్తినుగ్నుఁ డగుదనుక చేయుకార్యములన్నియు వాని యలవాటుచొప్పున నుండును.

2. అలవాటులు మంచివి చెడ్డవి యను రెండువిధములైన వున్నవి. మంచియలవాటులు నీకును బరులకును మేలుసేయును. చెడువి చెట్టపుట్టించును. నీ వే స్వల్పకార్యాచరణమొనరించినను నీకేగాక నీ తోడివారలకును దాన నేమి హానివాటిల్లునోయని ముందుగ నాలోచనసేయుట యుచితము. నీ చెయ్వులవలన నీ కేముప్పును రాకుండ నెట్లు జాగ్రతపడె

చనో యట్లే యితరులకుఁగూడ నేవిధమగు ముప్పును గల్గ
కుండునట్లు ముందుజాగ్రత్త తీసికొనునది. నిప్పు రాఁజేయు
ముందు పొయ్యిలో నేకీటకములైన నక్కియున్నవేమో
వంటకత్తె చూచినయెడల నామె కేమి నష్టము? చూడకున్న
యెడల నందొకవేళ నడఁగియున్న క్షుద్రకీటకంబులకుఁ బ్రా
ణహానియే సంభవించును గదా! తన యజాగ్రతయలవాటు
వలన నిండుప్రాణము మరణింపవలసినదే గదా! అందుచే
నామె జాగ్రత్తనలవడఁజేసికొనుటే మంచియలవాటని నీకుఁ
దోఁచుట లేదా? ఇదేవిధమున మంచియలవాటులను నేర్చు
కొనుట యెల్లర కవసరము. చెడ్డయలవాటులకు దిగుట దుఃఖ
మునకుఁ జేటు.

3. అలవాటు మంచిదైనను జెడ్డదైనను బలవత్తము
మైనది. అలవాటు కాలక్రమమునఁ బ్రకృతిసిద్ధమై పరిణ
మించును. ఏపనికైన నలవాటుపడితివా యది మఱి వదలఁ
జాలవు. అనుకొనకపోయినను నలవాటుప్రకారము పనులఁ
జేయుచునే యుందువు. ఇతరకార్యాసక్తుఁడవై యున్నవేళలఁ
గూడ నలవాటైనపనులఁ జేయుచునే యుందువు. వ్రాయుచు
నాల్కనాడించుట, పెద్దలతో మాటాడుచుఁ గాళ్ళూగించుట
మొదలగునవన్నియు నలవాటు లయ్యు నైజగుణములట్లుగఁ
గన్పట్టుటలో నాశ్చర్యమేమి? అలవాటువలననే స్థిరమగు
నడకతీరు మాటవరుస కార్యసాధనక్రమము పట్టువడుననుట
నిజము. ఒకమాఱు పట్టువడిన యలవాటులు వదలించు
కొందమన్నను వదలవు. ఏ చెడ్డయలవాటునకైన లోనైన దాని

మానవలె నని ప్రయత్నించువారి కీ యలవాటుబలము తెలి యును. తేనీటిఁ గ్రోలుట కలవడి, కొంతకాలము దానఁగల్గు చెడుగులచే బాధపడి తదభ్యాసము మానవలె నని చీటికి మాటికిఁ బ్రతినలఁ బూనువారేకాని మానినవారు వ్రేళ్ళ లెక్కింపఁదగినవారుగాక యొందఱో యుండరు. అట్టివేళ మానవనిగ్రహశక్తికిని నలవాటుశక్తికిని ఘోరసంగ్రామమై యలవాటే కడకు విజయధ్వజము నెలకొల్పును. మానవు డోటుమిఁగొని యయ్యలవాటును విజేతకు దాసానుదాసుండై యాది మఱచి ఘనుఁడ నని మురియుచుండును. అలవాటింత దా ర్ఢ్యవంతమైనదగుటచే నీవు తొలుతనే మంచియలవాటు లబ్బఁ జేసికొనవలయు. నీబుద్ధి కేది న్యాయమని తోఁచునో యదియే కొంతకాల మొనర్పుము. అంత న్యాయాచరణమే యలవా టగును. అన్యాయకార్యములఁ జేయుటకు నీమనసు పోనే పోదు. ఈవిధమున జరించితివా సుగుణసంపత్తి యొదవును. మరియాద లబ్బును. చెడ్డయలవాటులు మంచివానికంటె సుల భ్యములగుటం జేసి వానిబారిఁబడక మెలంగినవాఁడే ధన్యుఁడు.

4. ఏ యలవాటైన నబ్బు విధమేది? చేసినదే చే యుట యొకమార్గము. ఈ దినమున నుదయమునుగంట లకు స్నానము జేసితివా రేపుదయ మావేళకే యాపనిఁ జేయుము. అట్లొఱఁగునఁ గొంతకాలము చేసితివా యాపని యానందకర మగును. తొలుదొల్తఁ గష్టముగా నున్నను, నీవు వదలక వేళప్రకార మహరహము నిరాటంకముగ న క్కార్యమే చేయుచుంటివేని యది నీ కలవాటై సుఖప్రద

మగును. దానికిం దార్కాణ మబ్బెసమైన యుదయస్నాన మే కారణముననో మానినదినమున నీ కితరకృత్యములు సాగవు. బుద్ధి పనిచేయదు, మతి సెడిన ట్లుండును. బలవంతముగ నన్యకార్యాచరణమునకుం గడంగినను నిన్ను నీదృష్టిని మనస్సును మానినస్నానముదిక్కునకే యాకర్షించు నయస్కాంతమలవాటు. మరగిన యలవాటు మానవుఁడు మడియువఱకు మానదు.

5. అలవాటొక్కనాఁడు పట్టువడదు. సంతతము నియమానుసారముగఁ జేసిచేసి యవయవము లరిగి కాయలు కాయవలయును. ఎంత తొందరలోనైన, నెట్టిపనియొత్తిడిలోనైన నీయభ్యాసకాలమున కలవాటు జరిగిపోవలసినదే! అనఁగా దీర్ఘాలోచన శ్రమ లేకయే యలవాటుచొప్పున నకార్యము చేసితీరెదవు. ఇది యసంభవ మనుకొనరాదు. నీ వెంతయాలోచనానిమగ్నుఁడవైయుండి వీథినిఁ బోవుచున్నప్పుడైనను దారి నీ వనుకొన్నట్లు నీయడుగులు నీయింటికే కొంపోవును. అడుగడుగునకు నీబుద్ధి 'యబ్బాయీ! యాదిశ నేగు'మని యుద్ఘోషింపకున్నను నీపదచలనమువిషయమై యోచించుటకు నడకలో నాలోచనములో నీకుఁ దీరికయైన లేకున్నను మనస్సన్యథావర్తి యైయున్నప్పటికిని నీదారి నింటికే పట్టించిన దలవాటు. ఇది పట్టువడుట కెంతయో కాలము పట్టినది. ఇట్లే మిగిలిన యన్నిటివిషయ మని గ్రహింపఁదగును.

6. ఒకయలవాటు పట్టువడఁ జేసికొనుట దారపుబంతిఁ జుట్టుట వంటిది. దారపుబంతి చుట్టుటకు నేర్పును బట్టుదలయు

నుండి తీరవలెను. బంతి పెఱిఁగినకొలఁది చుట్టుట సుకరమ
గును. కాని యే కారణముచేతనైన బంతి చేయిజారి పడి
నదా, యొకటికాదు రెండుకాదు వందచుట్లదారమూడిపోవును.
తిరిగియదిచుట్టనెంచువాఁడేఁడువెన్కలఁ బనిప్రారంభింపవలెను.
ఒక్కపరి చేయిజారుటచే నప్పటిచుట్టయే కాక వెనుకచుట్టిన
చుట్లును వానికై గడపినకాలమును బడినపాటును నిరర్థము
లగును. అవ్విధంబున నేయలవాటులోఁ బదిదినములు పని
చేసినను వృద్ధి గన్పింపదు కాని యొక్కదినము పొరపాటునఁ
బనిచేయకున్నచో నాఁటిపనియే కాక యంతకుఁబూర్వ మెన్ని
దినంబులో నొనర్చినదంతయు వ్యర్థమై చెడును. పాటంతయు
నొక్క దోసంగుతోఁ జెడుననుట యిక్కతననే.

7. ఒకని యలవాటుల పుంజమే వానియొక్క శీల
మనంబడుచున్నది. మంచియలవాటులం జిన్నప్పుడే నేర్చితివా
యోగ్యుఁడ వగుదువు, చెడ్డయలవాటులం జిక్కితివా యయో
గ్యుఁడ వగుదువు. చెడ్డయలవాటుల మరగినచో నసభ్యకార్యము
లాచరించెదవు; మరియాద లతిక్రమించెదవు, పరులయసహ్యము
నకుఁ బాత్రుఁడ వయ్యెదవు. మంచియలవాటులే గరచినప్పుడు
యోగ్యప్రవర్తనముగలిగి పదిమందిలో నోహో యనిపించు
కొనెదవు. ఏతత్కారణముననైన నీవు సదాచారసంపత్తిగల్గి
మంచిపనులఁ జేయుట కలవడి సౌఖ్యమును బొంది త్వదను
సరణపరులకు సౌఖ్య మొనగూర్చు శీలముంబొందుట ధర్మము.

8. కొన్ని చెడ్డయలవాటులఁ జెప్పుమంటివా యవి తండో
పతండములుగఁ గొండకు భూమికిం దాళము వేసినన్ని యున్నవి.

చెప్పదొరకొన నంతము దొరకదు. ఎంతమంది వీథులలోఁ బాదరక్షలులేకుండఁ బోయెదరో యెఱింగియు, వారికాళ్ళ కేమికీడుగల్గునోయనియేని యోజింపక రాజబాటపైఁ బశువులు మూత్రపురీషములు విడుచుచందమున నుమిసి వీధి ధ్వంసమొనరించు కొందఱఁ జూచితివా? కొందఱుస్త్రీలిండ్లలోని చెత్తచెదారమునంతయు నెత్తి తెచ్చి బాటప్రక్కలనైనఁ గాదు, నడుమఁబోయుట గమనించితివా? పట్టణములలోఁ గంకరబాటనడుమఁ బుల్లియాకు లెగురుచు సూకరంబుల నాకర్షించుటఁ గంటివా? ధూమశకటంబుల నల్గురుం జేరుబల్లలమీఁదను దిగువను నహాస్యకరమగుగతిని జెఱుచు మూర్ఖాళికి నితరులపై నెంత లక్ష్యమున్నదో గ్రహింపుము. అరటిపండ్లయుత్తము మైలగుడ్డలతో నల్గురుఁ జూచుచుండ నిలిబలిలేకుండ నొంటిగాఁ దినినదేహికి మిగిలినది బైటకు విసరుటకుఁ జేతులురావా? రైలుబండిలోనే వేయవలయునా? పొట్టకూటికై బండిఁ ద్రోలుకొనువాఁడు లోపలఁగూర్చున్నవారిముక్కులు బద్దలగునట్లు పొగవిడుచుచుఁ జుట్టత్రాగుటయా? ముక్కుపచ్చలారని పసివాండ్రు యౌవనమైకమున ననుభవజ్ఞులచెప్పుచేతల మెలంగక యయోగ్యులై సంచరించుటయా? ఈ చెప్పిన వన్నియుఁ జెడ్డయలవాటులే. వాని పొంతఁబోకుము. ఇవిగల వారలకేగాక తోడి మానవులకుంగూడ నహాస్యకరములై రోగహేతువులై దుఃఖభాజనము లగును.

9. ఇఁకఁ జిన్నవార లలవడఁజేసికొన లేఁ బ్రాయముననే యత్నింపవలసినవి చెప్పెద:—

i. <u>నిరంతరపరిశ్రమ</u>:—శరీరమునకును మనస్సునకును నెడతెగని పరిశ్రమకావలెను. కష్టేఫలీయనునట్లు పాటుపడిననే ఫలము దక్కును. తాము పాటుపడకయే సర్వము లభించు ననుకొనువారు వెడంగులు, పరిశ్రమ మొక్కార్యంబునేని సులభసాధ్యము గావించుట నిక్కంబు.

ii. <u>పట్టుదల</u>:—తలపెట్టినపనికి జలగవలె నంటిపెట్టు కొని యాటంకముల సరకుగొనక, మనోరథభంగములకు వెఱువక, జయము గలుగువరకుఁ జేయుచుండుటకుఁ బట్టుదల మూలము. దీనంజేసి కొండంతలు గోరంత లగును.

iii. <u>కాలనియమము</u>:—అనుకొన్న వేళ కనుకొన్న పని చేయుటే కాలనియమము. దాన గౌరవమబ్బును. కాలనియమ ము లేనివానికన్నఁ గాలనియమ మున్నవాఁడు రెట్టింపుఁబనులఁ జేయ సమర్థుఁడగును. రెట్టింపు సులభముగాఁ జేయఁగల్గును. రెట్టింపుతృప్తి పొందఁగల్గును. ఇతరుల కాల మతఁడు వ్యర్థ మొనర్పఁడు.

iv. <u>వేకువను నిద్రమేల్కొనుట</u>:—ఇది శరీరమునకు ను మనస్సునకును శాంతినైర్మల్యతలఁ గలిగించును; ఆరో గ్యముం గూర్చును. జీవితమును గాచి పెంపొందించును.

v. <u>సాత్వికనిరాడంబరజీవనము— ఉన్నతాలోచనము</u>:— జీవనమునకు గావలసిన యవసరవస్తువులకు వేషమునకు మా త్రము ధనము వెచ్చించుచు, నిరాడంబరముగ మెలంగుఁ

బలమున కవసరము. భోగములు తాత్కాలికసుఖకరము లయ్యు బలమును జెరుచును. సదా మహద్విషయంబులనే మనంబునఁ బ్రవర్తింపఁజేయునది. విలాసవిషయములు తేలికభావముల పొంత మనోహాయంబును డాయింపంజనదు. దీన నీయోగ్యత మంచిదై జీవితౌన్నత్యంబుం బెంపొందించును.

vi. తలపెట్టినపని బాగుగఁజేయుట— సంపూర్ణహృదయముతోఁ జేసికొన్నపనిని గూలంకషముగ శ్రద్ధగాఁజేయుట లగ్గు. కొంతమంది యనాలోచితముగా నొకపని ప్రారంభించి, తాముచేయుపనిపై మనసుంచరు. ఇష్టములేనిపనిని మొదటనే మానందగును. పనిచేయఁదలపెట్టి సరిగా నెఱవేర్చకుండుటకంటె దోషం బన్యంబుండదు. అట్లొనర్చువారి కాపనులు వ్యర్థములగుటయే గాక యమూల్యము గావించుకొనఁదగు జీవితమే వ్యర్థమగును. వారికి నైతికవృత్తి తక్కువ. అంతరాత్మ సుప్రబోధము లసలే మృగ్యములు. చేయనిశ్చయించుకొన్నది తుదివఱకు జాగ్రత్తగా శ్రద్ధతోఁ జేయుట సమంజసము. ఈ యలవాటువలన బుద్ధికుదురును; నిల్కడ యబ్బును; జయము చేకూరును.

vii. కోప మడంచుకొనుట:—, కోపములేకుండుట దైవసంఘటనమే. నిర్మలజీవనమునకుఁ గోప మడంచుకొనుట యవసరము. చిఱచిఱలాడువాఁడు తననేగాక యితరులఁగూడ క్షోభింపఁజేయును. కోపమువలనఁ బనుల ధ్వంసముగావించుకొన్న వారధికసంఖ్యాకులున్నారు. కోపమును సాధ్యమైనంతగా

నడంచుటే కర్తవ్యము. ఆకోపము రాక్షసతామసగుణము గాని మానవగుణము కాదు. అభ్యాసమువలనఁ గోపముం జయింపఁ గలవు. క్షమ కోపమునకు సంకల్పవర్జనము.

viii. <u>నిర్మలమనోవాక్కర్మలు</u>:—చెడునాలోచనలఁ జేయునవ్వు. అవి కలిగినను వానిని నిలువనీయకుము. మంచివానిపైననే దృష్టిని మనస్సునుబ్రసరింపనిమ్ము. మనస్సు విమలమైనయెడల వాక్కర్మలును స్వచ్ఛతగాంచి పవిత్రము లగును. చెప్పవెఱచుతలంపులఁ దలంపకుము; చేయవెఱచు వాక్కు లాడకుము, ఆలోచింప వెఱచుగార్యములు చేయకుము. ఏపనినైనఁద్రికరణశుద్ధిగఁ జేయునది.

10. ఈవిధమున నిందుఁజెప్పినవే కాక యణకువ వినయము మొదలగునవన్నియుఁ జిన్నప్పటినుండియు నలవాటు గావించుకొన్నవాఁడు యోగ్యుఁడై యనుకూలజీవయాత్ర చేయఁగలఁడు. ఏయలవాటైనఁజూచి భయపడక ప్రయత్నించినఁ బట్టువడుననుట నిర్వివాదాంశము. అభ్యాసమువలన నెద్దియుం గూసువిద్య యగును. మంచియలవాటులపుంజమే యోగ్యత.

11. ఏగూటిపిట్ట యాకూత కూయును. ఏయింటఁ బుట్టినవాఁ డాయింటిమర్యాదల నేర్చి యాయింటియలవాట్ల కలవడును. యజమానుఁ డేయలవాటు లున్నవాఁడో వాని గృహములోనివా రాయలవాటులు గలవా రగుదురు. తండ్రి నిష్పాపరుఁడైనచోఁ గుమారుఁడు నట్టిఁడగును. తత్ప్రతికూలవర్తనుం

డగు కుమారుఁ డుండఁడా? పండితపుత్రుఁడు పామరుండన్న దుత్తటాటోటువచనమా యని యడుగుదువేమో? అది యెల్లెడల వర్తింపదు. సాధారణముగఁ దల్లిదండ్రులయలవాటులే బిడ్డల కలవడును. కూడనిప్రేమచే శిక్షలో బిడ్డల నుంచని తల్లిదండ్రులే బిడ్డల దుర్వర్తనాంకురమునకు దానిదోహదమునకు హేతువులు. శిక్ష బాలుర కింపుగాఁదోఁచుటఁ గన్పట్టదు. జాలిఁగొని తల్లిదండ్రులే యుపేక్షించినచోఁ, బిదప వారిపశ్చాత్తాపము గతజలసేతుబంధనం బగును. కాఁబట్టి తమకీర్తికి హాని యనుకొనక, విధాయకకృత్య మనియెంచి బిడ్డలకు బాల్యముననే మరియాద లలవఱచుట జననీజనకులకు ధర్మము. మొలకై వంగనిది మ్రానై వంగదుగదా! కావున శైశవమునుండియు బిడ్డలఁ గన్న తల్లిదండ్రులు బిడ్డలను సమ్యగాచారసంపన్నులఁ జేసి వంశమర్యాదలఁ గాపాడక యాభారము నొజ్జలపైకిఁ ద్రోసి బిడ్డలు చెడిననా డొజ్జలఁ దూలనాడుట నీచము. బిడ్డల దిద్దుటకుఁ దల్లిదండ్రులే పూనినప్పుడు బిడ్డ 'సత్పుత్రః కులదీపకః' అను నుడి నిజమొనరింపఁ గల్గును.



# ఓర్పు.

1. ఓర్పునకు క్షమ యనునది పర్యాయపదము. క్షమ యన నేమియో తెలిసికొనుటకు ముందొకటి రెండుదాహరణంబులం బరిశీలింపఁదగును. క్షమలో భూదేవికీడుగానరాదు. భూదేవి తాలిమికత్తెల కన్నారు. కావున నామె యోర్పు

నిరుపమానము. ఓర్పుగల స్త్రీని భూదేవి యని యెల్లరుం బ్రశంసించెదరు. భూమి కిట్టి క్షమావంతురాలని బిరుద మేల కలిగెనో విచారణ యవసరము. తనపై నెంతమంది తొ్రక్కు చున్నను, నెన్నిచోట్లం ద్రవ్వుచున్నను, నెట్టి కల్మషపదార్థ ములు పారవేయుచున్నను, ధరిత్రి భరించుచున్నది. సమస్త వస్తు వృక్ష జంతు మానవ నివహాభారంబును మోయుచు, జెక్కుచెదరక నిల్చియుండి విధాయక కృత్యములు నెఱవేర్చు చున్నదే కాని యాగ్రహము వహించుచున్నట్లు కాన్పింపదు. నానాప్రకారచరాచరంబులు నింద వేవేలు జనియించి, యిందం బెఱిఁగి, పిదప నింద యడఁగు గావున నీభూమి సకల మునకుం బరాయణస్థానము. ఇదిగాక భూమి తనగర్భమున నున్న యత్యమితోష్ణోగ్రత గర్భనిర్భేదనమై యుండి బాధించి నను శాంతంబున నోర్చుకొనుచున్నది. దైనందిన సంచార ము సాంవత్సరిక సంచారము సర్వదా చేయుచునే యున్నది. కష్టములన్నియు భరించు నిత్యధర్మములు నెఱవేర్చుచున్నది. దుఃఖభరణశక్తినే క్షమ యందురు. ఒకయువతి యత్తింటిలో నత్తమామలపోరుఁ బడుచు, నాఁడుబిడ్డలరవ్వకాగి, భర్త కాఠి న్యమునకు నిలిచి యెల్లర కడుపాఁకలలో నుండి సంసారకృత్య ములు యథావిధిగఁ జేయునప్పుడే యామె తాల్మి గలదగును. అట్టి కోడంట్రికఁపుబాధలే లేకున్నను, నాబాధలఁబడక యామె యెదుర్కొన్నను, బడలేక యాత్మహత్యఁ గావించుకొన్నను గూడ నాస్త్రీకిఁ దాలిమికత్తెయను ప్రశంసాయోగ్యనామంబు

లభింపనేరదు. కాఁబట్టి కష్టములు గలుగ వానినన్నిటిని నిలు పోపుటే క్షమ.

2. క్షమావంతుఁ డొకని గుఱించిన కథ గలదు. పూర్వ మొకరాజు. ఆరాజు కొలువులోఁ గూర్చుండ సేవకులు వరుసగా వచ్చి దుఃఖవార్తలే వినిచిరి. ఒకదూత 'అయ్యా! కాపరులు చావఁ బసులన్నియుఁ బరరాజుల పాలయ్యె' ననియు, రెండవదూత 'పిడుగుపాటున గొఱ్ఱెలును గాపరులును మరణించి' రనియు, మూఁడవదూత 'యుష్ట్రములు వైరి వశమయ్యె' ననియు, నాలవదూత, 'రాజకుమారులు కుమార్తెలు విందారగించుచుండఁ బైకప్పుకూలి వారి నడంచె' ననియు విన్నవించిరి. ఇన్నియుదంతంబు లొకదానివెంట నొకటి కర్ణకఠోరముగ వినవచ్చినను ధృత్యున్నతోత్సాహుఁడై పిఱికితనంబు వహింపక చిత్తశాంతిని నెలకొల్పుకొనఁగలైను. 'నన్ను దిసమొలతోఁ బుట్టించితివి, పరమేశ్వరా! సకలైశ్వర్యముల నొసంగితివి. ఇచ్చినవన్నియు నీయవిగాని నావి కావు. నీవస్తువులను నీవు మఱలఁ గైకొంటివి. నాకువిచారమేల? దిసమొలతోనే నన్ను నీసన్నిధిం జేర్చుకొనుము. కృపానిధీ!' యని యారాజు స్థైరణతోఁ బ్రార్థించెను. ఆతని కడ కింకొకదూత వచ్చి "నీ రాజ్యమంతయు శత్రురాజులు జయించి" రన్నను మరి యాతఁడు భయముఁ జెందఁడు. తన్నరపాలుని పా తెడలని తాలిమి ప్రశంసనీయమైనది.

3. క్షమావంతులందుఁ బేర్కొనఁదగినవాఁడు కర్ణుఁ డొక్కఁడు. ఆతనియుత్సంగంబున మస్తకంబుఁ జేర్చి గురుండు

నిద్రించుచుండ నొక్క ఘోరకీటక మాసూర్యనందను గ్రీఁదొ
డఁ దొలిచె. గురునిద్రాభంగం బగు నని యెంచి యెంతబాధ
కైన సైరించి రక్తస్రావమును సరకుగొనక ధైర్యంబునఁ
గీటకకృత్యంబున కోర్చి యాతఁ డచలుండై యుండెను. రక్తము
నిజశరీరముం దాక గురుం డగు పరశురాముండు నిద్రమేల్కొని
జరిగిన యుదంతం బెఱింగి శిష్యు నుద్దేశించి, 'వత్సా! పరు లెరికి
నీకున్న యీనిరవధికమగు తాల్మి లే' దని సంభావించెను. అది
యే గదా కర్ణున కెన లేనియోగ్యతాపత్రమును బిరుదమును
బసదనంబును. కాని 'తనకృతిప్రమోద్దేశము నెఱవేరుటకు
భంగము వాటిల్లునని కర్ణుఁడోర్పుజూపెను. ఇది ప్రశంసాయో
గ్యము కా' దని కొందఱమతము.

4. సహన మనునది స్థాణుగుణము. ఒకని నెత్తిపై భార
మిడి యెండలో నిలుచుండుమని వాని నాజ్ఞాపించినపుడు వాఁ
డట్లొనరించినచో సహనశక్తిగలవాఁడని యర్థము. నిలుచుండు
టకు విసుఁగుఁజెందెనా క్షమాశూన్యుఁడగును. పెద్దభారమును
వహించుట దేహబలమును దెల్పును. మోయుచు నీయాజ్ఞను
వర్తియై యెండలో వేడియిసుకపై వట్టిపాదములతో నిలుచు
టకుఁ దాల్మి గావలెను. ఇసుకవేడిమికిఁగాని యెండతాపము
నకుఁగాని, శిరోభారమునకుఁగాని విసుఁగుఁజెందక యాజ్ఞా
బద్ధుఁడై నిలుచుటతాల్మి. ఎన్నికష్టములువచ్చినను భీతిల్లక,
వానినన్నింటిని భరించుశక్తియోర్పు. విద్యార్థులెన్నితప్పు లెన్ని
మాఱులుజేసిన నుపాధ్యాయుఁడు కినియక వానిని దిద్దుబాటు
చేయుటకుం గారణ మాతనియోర్పు. బిడ్డలయేడ్పుతో భర్త

చిరాకుతో నత్తమామల యాడిగంబుతో బంధుజనాదర
ణంబుతో సంసారతాపత్రయమునంబడి కొట్టుకొను కోడలినిఁ
గష్టనిష్ఠురముల భరింపఁజేయునది సైరణశక్తి.

5. ఏకార్యాచరణమునకైన నోరిమి ముఖ్యావశ్యకము. కార్యసాధనమునఁ గలుగు కష్టము లనేకములు. కార్యమారం
భించి విఘ్నములఁ జూచి భయంపడి, చేయుటని మానుట
ధైర్యవంతులకుఁ దగు లక్షణముకాదు. ఎన్నివిఘ్నము లెదు
రుగానిల్చియు ధీరమానవుని క్షమాకవచమును దాకఁజాలవు.
ప్రహ్లాదుని యాదర్శనీయక్షమయే యాతనిభక్తికింబునాది. జన
కుఁడు తన్నెన్ని బాధలపాల్సేసినను వానినన్నింటికి నోర్చి
తాలిమికాఁడై కీర్తిఁగన్నవాఁడు ప్రహ్లాదుఁడు. హిరణ్యకశి
పుఁడు తనయుని గష్టముల పాల్సేయుకున్నను బ్రహ్లాదుఁడా బాధ
లపడలేక లొంగిపోయినను భక్తునియొక్క యోరిమికిం దావు
లేదు. ఓరుపరులక్షమఁ బరీక్షయొనరించుటకో యనఁ గష్టము
లధికసంఖ్యాకము లగుచుండును. వానినెల్ల ననుభవించి
యనుభవించి తమలో మొలకెత్తిన క్షమాబీజమును బెం
పొందఁజేసికొనువారలే తాలిమికాండ్రై ప్రసిద్ధికెక్కుదరు.

6. క్షమలేకున్నచో నాగ్రహము గలుగును. ఏడ్చి
విసిగించు బిడ్డయెడల తల్లికిం గోప ముద్భవించినయెడల రెండు
చరుపులతో వాని నామె మోదును. తప్పులొనరించు శిష్యునిఁ
గని క్షమాహీనుఁడగు నొజ్జ వానిని దండించును. తపస్సుచేసి
యోరిమిలేని ముని యెన్నటికిఁ బ్రత్యక్షముకాని దైవముందూ
లనాడి చేయఁగడంగిన కార్యమునుండి విరమించును. గృహా

ములోని యల్లకల్లోలముంగని తాల్మివిహీను లాత్మహత్యలఁ
గావించుకొందురు. యజమానులవలనఁగలుగు బాధలఁబడఁ
జాలని సేవకులు తాల్మివిహీనులైనచో నెన్నియో పను లట్ల
నే నిలిచిపోవును. పసిపిల్లలు తడియిసుకలో బొమ్మరిండ్లు కట్టు
చో నోరిమిలేనియెడల వారొక్కనాఁటితోనే యాటలను
విడిచిపెట్టెదరు.

7. ఓరిమి ప్రతివ్యక్తికి నుండవలసినగుణము. ఇది పిన్న
వారిలోఁ దక్కువగనుండును. అందుచే వారికిఁ జీటికిమాటికిఁ
జిరాకుదయించును. పెద్దవారల కోరిమియధికము. సాధారణ
ముగ వయస్సుగడచినవారికిని ననుభవశాలురకును స్త్రీలకు
నోరిమి మిక్కుటము. బందుగులలో నోరిమి తల్లి కపారము,
భార్య కధికము. చుట్టరికము దూర మగుకొలఁది క్షమయు
క్షయమై పోవును. ధన మిచ్చి నాటకముఁజూడ నరుగువారు
నటకుల యాలస్యముపట్ల క్షమఁ జూపరు. దేశనాయకుల
యుపన్యాసములయం దెంత యాలస్యమైనను వినుట కెంత యి
బ్బందియైననుగూడ సహనముఁజూపి యూరకొనెదరు. పరుఁ
డు తనను దనవారిని దిట్టుచో నెవ్వఁడును క్షమఁదలంపఁడు.
వివేకజ్ఞుఁడట్టియెడలనే క్షమ ప్రకటించి యెదుటివాని కోపము
నుగూడఁ బోఁగొట్టఁగలఁడు. ఆరోగ్యముచెడినవా రోర్మిలేని
వారలనవచ్చును. బలాఢ్యులకుఁ దాల్మిలేనిచో క్షణక్షణము
నకుఁ జుట్టుపట్లవారిసిగొట్టి బాధించెదరు. పరిపాలకులకుఁ
బాలితులపట్లను యజమానులకు సేవకులయెడలను దేశికుల

కంటె వాసులయెడలను బలవంతులకు బలహీనులయెడలను క్షమయావశ్యము.

---

## స్తుతి.

క॥ తను లోకము కొనియాడఁగ,
విని యుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడుమే
లొనరించిఁ గీ డొకించుక
యును దనదెసఁ దోఁపనీక యుడుగుచువచ్చున్॥

1. స్తుతియనఁ బొగడ్త. సల్లక్షణలక్షితు నీక్షించినప్పు డీవు వానిని బొగడకతీరదు. నీవను కొనకయే శ్లాఘావాక్యము లొకప్పు డప్రయత్నముగా నీనోటినుండి వెల్వడును. ఘనకార్యము నొక్కఁ డాచరించువేళ 'బలే' యను హెచ్చరికమాట చూపఱుల పొగడికయే. ఒక్కనియం దుత్తమ గుణములఁ గనినవా రాతనిసమక్షముననే నుతిసేయ నక్కఱ లేదు. వాని పరోక్షమందునఁ బ్రశంసించిన బ్రశంసింపనగును. పరోక్షస్తోత్రము వలన స్తుతగుణాఢ్యత మఱింత ప్రకటన మగును. ఎదుటివాని గుణములు వానిం గనిపెట్టు మానవులబుద్ధికొలఁదినిబట్టి యుండుననుట నిర్వివాదాంశము. అనఁగా నల్పులు స్వల్పగుణములనే గని ఘనముగఁ బొగడెదరు. అంతకంటె నించుకంత యధికతర గుణములఁ గని వా రాశ్చర్యమగ్నులై మూకీభావము వహించెదరు; ఉత్తమగుణములదెస మధ్యాహ్నమార్తాండుని దెస యట్లు వారు మొగమెత్తి యారయంజాలరు. దీనియర్థ మే

మన నధమగుణములకు స్తుతియు, మధ్యమగుణముల కాశ్చర్య
ము, నుత్తమలక్షణముల కంథత్వము సాధారణులు ప్రదర్శిం
చెదరు. ఎవ్వఁడైన నెక్కువదూరము దూకెనా వానిని స్తవమొ
నర్చి, సత్తరవును నిర్మించెనా దానికాశ్చర్యముఁ జూపి సర్వస్వ
త్యాగమొనరించెనా వెఱఁగుపాటున మాన్పడి వానివైపు
బుద్ధి బఱుపఁజాలరుగదా సామాన్యమానవులు! జ్ఞానసంప
న్నులు నరుని సద్గుణజాతము గ్రహించువానినే స్తోత్ర మొన
ర్చెదరు.

2. స్తుతిపాఠకులం దెన్నియో తరగతులవా రున్నారు.
కొందఱు పడికట్టుతాళ్లవంటి పదములఁ జేర్చుకొని వానినే
యెల్లర వర్ణించుపట్ల నుపయోగించెదరు. బట్టు లిట్టివారలై
'యింద్రు' డవు, చంద్రుఁడవు దానకర్ణుఁడవు మొదలగు పద
ములఁ బిడుగునకు బియ్యమున కొకచే మంత్రమన్న ట్లందఱి
నుతించునప్పుడును వాడెదరు. వీ రంత తెలివైనవారు కారు.
వీనివలనఁ బొగడ్తవడువాని కేమియు నపకారము లేదనవ
చ్చును. ఇఁక రెండవతరగతివారు లౌక్యులు, మోసగాండ్రు,
స్వలాభపరాయణులు. వీరు నీ కేగుణమున్నదన్న నీవు విని సం
తోషించెదవో గ్రహించి దానినేరి యదియే పొగడఁగడంగె
దరు. దాన నీవుబ్బి తబ్బిబ్బై వారి నానందింపఁజేయ సంసిద్ధుఁడ
వయ్యెదవు. ఈ రెండు తెగలవారికిం దోడుగ నెదుటివాని
యందు లేనిగుణముల నేదో కారణమునఁ బ్రశంససేయు
వారిని జెప్పనొప్పు. వా రిచ్చకములాడుటచేఁ గల్లరులు.

మొత్తముమీద గుణగ్రహణపారీణులస్తుతులు సామాన్యుల
పొగడ్తలకంటె విలువగలవనుట యథార్థము.

3. లోకములోఁ గొన్ని పొగడ్తపదములు మరియాద
కొఱకు గౌరవార్థముపయోగింప వలసియున్నది. ఏలికను సం
దర్శించునప్పు డివి సాధారణముగ నెల్లరు నొనర్పవలసినదియు.
కేవలము మహారాజులకే గాక గొప్పవారివిషయములలోఁ
గూడ నుతులావశ్యకములు. మఱియు న్యాయమూర్తులని యొ
క్కని స్తుతించునప్పుడు న్యాయమూర్తివై యుండుమా యని
చెప్పుటయుఁ గావచ్చు. ఇట్టివాఁడవని యొకవ్యక్తిని బొగడుట
లోఁగలసారము నీ వీరీతిని వర్తింపుమని చెప్పుటయే. కొంతమం
ది యెదుటివాని కసూయాగ్రహము లుద్భవించున ట్లుగ్గడిం
చెదరు. దీనివలన నుపకారమునకన్న నపకారమే యధికతరము.
తమకుఁగల్గునుపకార మెద నెంచి యెదుటివానిఁ గొండాడిలాలనఁ
జేసి వశవర్తునిఁ గావించుకొనుటయుఁ గలదు. తనకంటె తక్కువ
వారిచేతఁ, గ్రొత్తవారిచేతఁ, దనకు హితమగు కార్యము చేయిం
చుకొనుటకై, ప్రేమగలవారిని వశపఱచుకొని యక్కఱ
దీర్చుకొనుటకై యుపయోగించు స్తోత్రముల కర్థ ముండ నే
రదు. పొగడువాఁడును బొగడ్తనందువాఁడునుగూడఁ గార్యాం
తమునఁ దాత్కాలికోపయోగకరములగు ముఖస్తుతివాక్యములు
నిజమని తలంప వీలు లేదు. నుతగుణములు తమయందున్నను
లేకున్ననుగూడఁ బ్రాజ్ఞులు శ్లాఘించువారి నేవగించెదరు.
స్తోత్రపాఠములఁ జదువు చాలింపుమని మందలించెదరు. సజ్జ
నులు పొగడ్తల కుబ్బకుండియు స్తోత్రపాఠకులకు మేలే

చేయుదురు. అవసరమగునంతస్తుతి మేలుచేయు ననుట జన
బాహుళ్యముయొక్క యభిప్రాయము. కొంద రాడు పలుకు
పెడసరము లేక శ్రోత్రపేయమై మృదుత్వముగల నుతిప్రి
యమై యుండును. అట్టిచో వచోనైపుణ్య మున్నవారి వాక్య
ము లెదుటివానిని మోమోట పెట్టఁజాలవే? మఱియు స్తోత్ర
పాఠము లెఱుఁగక తమకార్యములఁ జెఱచుకొన్నవా రున్నా
రన్నప్పుడు స్తుతి యవసగము. తప్పక తెలియంగలదు.

4. నీవెంటఁ దిరుగుచు నిన్నెల్లవేళలఁ బొగడుటయే
జీవనము గావించుకొన్న స్నేహితులంబోలు వారి నుతులు శాప
తతులు గాని యన్యంబులు గావు. వ్యక్తులఁగూర్చి గాని వస్తువులఁ
గూర్చి గాని యధికప్రశంస కూడదు. "అతి సర్వత్ర వర్జయేత్"
అనునది నుతిపట్లను నుపయోగింపఁ దగును. మితిమీఱిననుతి
దుర్గుణాపాదమునందు దావొసంగును. నుతింపఁబడినవార లిరుగు
పొరుగువారి యసూయాగ్రహంబుల కగ్గమగుదురు. ఒకనిఁ
గూర్చిన పొగడ్తల వినిన కొంద ఱీర్ష్యాగ్రస్తులు తమ్ముఁ బరుల
స్తోత్రములు చేఁబట్ట లేదని బట్టుల పైఁగినియ నవకాశము గలి
గించుకొనెదరు. స్తుతించువాఁ డెదుటివానిని గాక వాని యు
ద్యోగమునో వృత్తినో ప్రశంసించుట యోగ్యమైనపని. 'నీవు
బుద్ధిమంతుఁడవు సత్యసంధుఁడ' వనుటకంటె, నీవు న్యాయవాదివి
స్వతంత్రవృత్తి చేకొన్నవాఁడ వని బట్టు అన్నచోఁ బొగడఁబడి
నవా డుప్పొంగును. సద్గుణములమాట యటుంచి గడ్డిపోచ
యార్జన లేని న్యాయవాదికూడ నీమాటల కలర నదనున్నది. నీ
[illegible]గాని కొలుఁకూటములోని బంట్రౌతుతోఁ బనిగల్గి

నప్పుడు వానింజీరి పేర్వెట్టి పిల్వక 'హుజూరువా' రను పద
ప్రయోగముం జేసితివా, వాఁడు నీకు దాసుఁడగును. తా సేవిం
చెడి మండలాధికారియే తనకిందివాఁ డని యాక్షణమున నా
సేవకుఁడు మైమఱపునఁ దలంచును; నీకార్యము సానుకూల
మొనరించును.

5. పూర్వము పొగడ్తలొల్లని నృపాలశేఖరుం డొక్క
రుం డుండెను. ఆతఁడు స్తోత్రపాఠకుల నేరిం దరిఁజేరనీయకుం
డెను. కొంతకాలమున కొకగడుసరిబట్టు వాని నెట్లో సమీ
పించి, 'అయ్యా! నేను భూమండలమంతయు బరిశీలించితిని.
పురాణములవింటిని. చరిత్రలు చదివితిని. కాని రాజులందఱును
స్తుతు లందుకొనువారలే నాకుం గన్పట్టిరి. పొగడ్తల నొల్లని
వాఁడవు నీ వొక్కఁడవే సుమీ,' యనెను. దాని కారా జలరి
బట్టునకుఁ బసదనంబిచ్చి గౌరవించెను. దీనింబట్టి తేలిన దేమి?
పొగడ్త లసలె యొల్లనివాఁడు మహిలో లేఁడు.

6. పరస్తుతి యాత్మస్తుతి యునునవి రెం డున్నవి. రెం
డింటిలోఁ బరులసుగుణోద్ఘాటనము మేలు. కాని స్తుతిభేదంబు
లం బరికింప నన్నింటిలో నాత్మస్తుతి పరమనీచము. 'నేను చా
రస్వభావుఁడను. సుగుణ వంతుఁడను, నేను సౌందర్యవంతుఁ
డ ననుకొని యెవనిమట్టునకు వాఁడు చెప్పుకొనుట మూర్ఖత.
ప్రసంగమం దెప్పుడు నిజగుణముల బేర్కొని వర్ణింపఁబూనుట
యెదుటివాని దృష్టిలో న్యూనతఁజెంద నుంకించుటయే. స్వగు
ణములఁ బ్రస్తుతించుకొనుట నీచునివృత్తి. బుధు లెప్పుడు
నల్పజ్ఞుల మనుకొనుచుండఁగాఁ బామరుఁడు పండితుఁడననుకొని

తన్నుఁ దా మెచ్చుకొనుట హాస్యాస్పదవిషయము. ఎవని వస్తువులు వానికిఁ బ్రియములు గావచ్చు. అంతమాత్రమున వణిజునివలె నాయంగడిలోనివస్తువులే మేలైనవని ప్రసంగించుకొనుట పామరత్వమునకే గాక యల్పజ్ఞతకుఁ దార్కాణము.

7. దైవస్తుతి దేవీస్తుతి యనునవెల్ల తెలిసిన వే. దేవుని వరములఁ బడయుందలంచి వానిని స్తుతింపఁగడంగుట భక్తుల నైజము. అనంతకల్యాణగుణుఁడవని యేమేమో మానవబుద్ధికిం దగిన నుతివాక్యము లాడెదరు. కాని యవి యెంతగొప్ప మానవబుద్ధిజనితములైనను దేవునికిం దక్కువవే యగును. తన్మూలమున భక్తులకు వేల్పునెడలఁగలప్రేమయు భక్తియు వెల్లడి యగును. స్తుతులవలన దైవమే యుపకారబుద్ధిఁగొని భక్తవత్సలుండుకా, మానవులమాటఁ జెప్పనేల? పోతనవంటి కొందఱు మహానిష్కామకవితల్లజులు భూనాయకులవాహనాదులయెడ నిరపేక్షులగుట శ్రీపతిస్తుతినిగాక నరపతిస్తుతి నొల్లక, తక్కుంగల శ్రీనాథాదికవీశ్వరులవలె నైహికవాంఛలతోఁ దమకబ్బంబుల రారాజుల కంకితం బొనరించి వారలఁ బ్రస్తుతింపరైరి. వారిప్రేరేనఁ దలంపక లేమిచేఁ గడగండ్లపాలైరి. నరనుతి సేయరైరి. ఏమనఁ దక్కినజంతువులకంటె మానవుఁడు మాటాడుటలో నధికుఁడైయుండి యావాక్కును తనతో సరిసమానుల పొగడుటకై వినియోగింపక వాగ్దాతను స్తోత్రముచేయుటకై వినియోగించుటే యుత్తమ మని వారియుద్దేశము.

8. ఎదుటివానికిఁ గోప మబ్బు నను భయముచేతనో వారిచే లాభము లందవచ్చు నను నాశచేతనో సామాన్య వ్యక్తులు స్తుతించెదరు. కాని ధీరోత్తము లట్టిస్తుతులకుం గడంగరు. స్తుతిచేయుటకుఁ బిఱికితనము హేతువై యుండవచ్చును. స్తుతి యెందును దోషము నడంచి గుణమును బ్రకటించుటయే గాక లేనిగుణము లున్నట్లు వర్ణించును. పరనింద యాత్మస్తుతివలె కళంకము నీచమైనది.

9. నరులను వారిగుణములను బొగడువాని పొగడ్త మనస్సులోనుండి వచ్చినది కాకున్నను నాలుకకొననుండి వచ్చినదైనను సరియే కాని దైవవిషయములోని స్తుతి త్రికరణశుద్ధిగా నుండకున్నచో మే లొందవకుండుటయే గాక కీడు గల్గును. మఱియుఁ బ్రతివ్యక్తియు నితరులచేఁ బొగడఁబడుటను వాంఛించును. ఆత్మవిషయకపరోక్షస్తోత్రముల విని మురియును; విననియట్లు నటించును. స్తుతుల నందుకొనఁగోరువార లా స్తుతుల నందుకొనఁదగు నర్హతను బడయఁ బ్రయత్నము లొనరించుట ప్రశంసనీయము. ఇక స్తుతి స్తుతికి స్వస్తి.

